# పారిజాతాపహరణము

గ్రంథకర్త:

బ్రహ్మశ్రీ

చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు.



శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

# నవలలు.

| | రు | అ |
|---|---|---|
| పంజాబు మెయిలు | 0 | 12 |
| విషహృదయము | 1 | 0 |
| హేమాసుందరి 1 వ భా | 0 | 12 |
| ,, 2 వ భా | 0 | 12 |
| నీవేనా? | 0 | 12 |
| టోపీదాను | 0 | 6 |
| శక్తికుమారి | 0 | 12 |
| రక్తవాహిని | 0 | 12 |
| ఇంద్రజాలము | 0 | 12 |
| రాజద్రోహి | 0 | 12 |
| వలపులరాణి | 0 | 12 |
| అర్ధరాత్రిపువింత 3 హత్యలు | 0 | 12 |
| ప్రతాపసింహ 300 పే॥ గ్లేజు | 1 | 8 |
| అఘోరి | 0 | 12 |
| అగ్గిరాముడు | 0 | 10 |
| నే నెవరిభార్యను? | 1 | 0 |
| నే నెవరిభర్తను | 1 | 0 |
| గోలుకొండ అపురూపము | 0 | 12 |
| బలేపెం | 0 | 12 |
| బొంబాయిఖూ | 0 | 8 |
| సాహసికుడు | 0 | 12 |
| భయంకరుడు | 0 | 12 |
| వశీంసుడు | 0 | 12 |
| వ్యామోహము | 1 | 0 |
| ఫ్లవరుగరల్-పువ్వులపిల్ల | 0 | 12 |
| అల్లరిపిల్ల | 0 | 12 |
| రివాల్వరు | 0 | 12 |
| శకుంతల బి. ఏ. | 0 | 12 |
| దురాశ అను ఆశాపిశాచము 1వభా | 0 | 12 |
| ,, 2వ భా | 0 | 12 |

| | | |
|---|---|---|
| అయిదులక్షల రూపాయ | | |
| చదువుకున్న భార్య | | |
| అల్లూరిసీతారా. | | |
| లోకాభిరాముడు | | |
| దొంగలనాయకుడు | | |
| హాలింకాయి | | |
| పరిశోధన | | |
| మోహపిశాచము | 1 | 2 |
| ,, | | 12 |
| కాలసర్పం | | 12 |
| ,, | 1 | 0 |
| ఘోరహంతకుడు | | 12 |
| కన్నపుదొంగ | | 12 |
| పగటిచుక్క 1 భా | | 12 |
| ,, 2 భా | 1 | 0 |
| బారిస్టరు పార్వతి | 0 | 12 |
| కాంతారాం ఎం. | 0 | 12 |
| మిస్. మధురిక | 0 | 12 |
| సర్కిల్ రంగనాథ | 1 | 0 |
| ప్రతిబింబములు | 0 | 12 |
| ఆనందభవనము | 0 | 12 |
| 13 వ నెంబరుగది | 0 | 12 |
| వజ్రహారము | | 12 |
| బాకుపోటు | | 12 |
| మగడుకానిమగడు | | 12 |
| మాలపిల్ల (అచ్యుతకన్య) | | |
| మృత్యుమందిరము | | |
| ఛాందసుడు | | |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్ డిపో

శ్రీ

# పారిజాతాపహరణము

ఇది

గయోపాఖ్యానము, చంద్రహాస, ప్రసన్నయాదవం, మొదలగు
నాటకములను రచియించిన

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే

రచియింపఁబడినది.

కాపీలు 1000

ప్రకాశకులు:

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

భాస్కరముద్రాక్షరశాలయందు ముద్రింపబడియె

రాజమండ్రి.

1933



[వెల రు 0—8—0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.

కైరవుఁడు—విదూషకుఁడు.

నారదుఁడు—దేవముని.

ఇంద్రుఁడు—దేవరాజు.

బృహస్పతి—దేవగురువు.

యముఁడు—దక్షిణదిక్పాలకుఁడు.

విజయదత్తుఁడు—మృతినొందిన కాంభోజరాజు

నారాయణశర్మ—మృతినొందిన యొక బ్రాహ్మణుఁడు.

చిత్రగ్రీవుఁడు—నందనవన పాలకుఁడు.

చిత్రరథుఁడు—గంధర్వుఁడు.

## స్త్రీలు.

రుక్మిణి—కృష్ణుని పట్టపుదేవి.

హంసపదిక—రుక్మిణి చెలికత్తె.

సత్యభామ—కృష్ణుని రెండవభార్య.

రమణిక } సత్యభామ చెలికత్తెలు.
భ్రమరిక }

రంభ—స్వర్గవేశ్య.

శ్రీ

# పారిజాతాపహరణము.

## ప్రథమాంకము.

(నాంది)

మ. కలుగం జేసెడుఁ గాక నిండుకృపమైఁ గళ్యాణము ల్మీకు వే
ల్పులకు న్వేల్పయి యగ్ని కగ్నియయి స్వర్లోకంబు పాలించు నిం
ద్రుని కిందుండయి యెల్లరుద్రులకు రుద్రుండై మహారాజరా
జులకుం రాజయిమించు చిన్మయుఁడు తేజోమూర్తి ధ్వాంతముక్

మ. కడుఁజిత్రంబుగఁ దోలుబొమ్మలగమిం గావించి యాడించి నే
ర్పడరం, బిమ్మట దాఁచు నాటకునిచాయన్ సృష్టిగావించియుం
దడవుం ద్రిప్పి హరించి జంతువితతిన్ దాల్మిం జగన్నాటకం
బడరం జేసెడు సూత్రధారుఁడిదు మీ కారోగ్యమైశ్వర్యముల్

మఱియు,

క. శ్రీవణానందధ్వనియై
ప్రవర్ధితోత్సాహావృత్తి భాసురమై స
త్కవిరాజవిరాజితమై
భువి నీసభ కావ్య మట్లు పొల్పెసలారున్

అట్టి యీసదస్సునకుఁ బుష్పాంజలి గర్భిత మగునొక్క విజ్ఞాపనముఁ జేయుచున్నాఁడను. (అని పువ్వులుచల్లి) ఓ సదస్యులారా!

చ. అనుపమవాగ్విలాసయుతులై చిరకాలము నిల్చి యక్షరా
లను పరమాణువు ల్గాని పదార్థములు న్రచించి మించి నే
ర్పెసయఁ గృతిప్రపంచముల నెన్నియొ సృష్టి యొనర్చునట్టి య
య్యనఘుల సత్కవీంద్ర చతురాస్యులఁ గొల్చెద కావ్యసిద్ధికిన్

మరియు,

తే. గీ. కావ్యమెంత యుత్తమమైనఁ గానఁబడెడు
గుణశతముతోడ దోషముల్ కొన్ని గలసి
మావిపం డెంతమధురమై మంచిదైన
జీడి యుండకపోవునే చివరకొంత?

అందుచేత మీరలు గుణగ్రహణప్రధానచేతస్కులరై యీ రూపకమును మన్నింతురుగాక! (అని తెరవంకఁజూచి) పారిపార్శ్వకా! నాటకప్రయోగమున కుపాంగముగ గానము వినబడదేమి?

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) అయ్యా! మీ రుపోద్ఘాతపూర్వకముగ నీ సభవారితోఁ జేయు విజ్ఞాపనము ముగియలేదని మేము రంగస్థలమున గాన మారంభింపలేదు. ఇప్పుడు మనము ప్రయోగింపబోవు రూపకము పేరెద్దియో యెవరు రచియించినారో వీరికిఁ దెలియఁజేయవలదా?

సూత్ర—ఔనౌను. ఇదిగో యిప్పుడే చెప్పుచున్నాఁడను. రసికేసరులారా! చతుర్థవర్ణజాతుండును గవికిఁ జిరమిత్రుండును రాజమహేంద్రవర నివాసియు, నిరంతర నాటక కుతూహాలియు నగు శ్రీయిమానేని హనుమంతరావునాయని ప్రేరణమున రాజమహేంద్రవర హిందూనాటకసమాజమునిమిత్తము బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహాకవి ప్రణీతమగు పారిజాతాపహరణం బను శృంగారరస ప్రధాన రూపకమును మేమీరాత్రి యిచ్చటఁ బ్రయోగింపఁ దలఁచుకొన్నారము

కావున మీరు సావధానముగ మాప్రయోగమును జిత్తగించి మాయజ్ఞత వలన జనియించు దోషంబుల క్షమియింతురు గాక! ఏలయన?

తే. గీ. కృతి ప్రశస్త మయ్యును బ్రయోగించువారు
మందమతులైన రసభంగ మందవచ్చు
తళుకు గాజుకుప్పెల నుండఁ దగినదివ్వె
వెలయునే మంటికుండలఁ బెట్టునపుడు.

పారిపా—అయ్యా! మీవిజ్ఞాపనము ముగిసినదా?

సూత్ర—ముగిసినది. రంగస్థల మంతయు సిద్ధముగ నున్నదా?

పారి—సిదముగ నున్నదాయని యడుగనేల? ఇదిగో మనసు మిత్రుఁడు కైరవుని వేషము వేసికొని తన చమత్కార వాక్యములచే సభాసదుల నెప్పుడలరింపఁ గలుగుదునా యని యువ్విళ్ళూరుచున్నవాడు. కైరవసభాసదుల యన్యోన్య సందర్శనమునకు మనము నిరోధము గలిగింపఁ గూడదు. కాన పోవుదము రమ్ము.

సూత్ర—సదస్యులతో మరియొక విజ్ఞాపనముఁ జేసిపోవుదము ఓ సదస్యులారా!

మ. హరివాసం బగుద్వారకానగరమై, యందొక్క పూఁదోటయై,
సిరులం జిమ్ముడు సత్యభామనగరై, శ్రీరుక్మిణీదేవి మం
దిరమై, వేల్పులకొల్వుకూటమయి, యాదేవేంద్రు నుద్యానమై
ధర నీసాలయె యొప్ప నిన్నియును జిత్తంబందు భావింపరే.

(అని యిద్దరు నిష్క్రమించు చున్నారు.)

ఇది ప్రస్తావన.

—:o:—

శ్రీ

# పారిజాతాపహరణము.

## ప్రథమాంకము.

ప్రదేశము:—ద్వారకానగరములోని శ్రీకృష్ణుని యుపవనము

(కైరవుఁడను శ్రీకృష్ణుని వేడుకచెలికాఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కైర—(తనలో)అహహా! ఈశ్రీకృష్ణుని చమత్కృతియు సాహసమును మెచ్చఁదగియున్నయవి. కడచిన సాయంకాల మతఁడు ప్రియసఖుఁడ నైన నన్నుం జేరఁబిలిచి "కైరవా! నే నొకానొక కార్యాంతరమున నొకచోటికిఁ బోవలసియున్నది. అచ్చటికి మనమిద్దఱమును గలసిపోవుదము. కావున జాముర్రాత్రి యగునప్పటికి నీవువచ్చి నాకొఱకీ యుద్యానవనమున నిరీక్షించునది" అని యానతిచ్చి మఱల నాకతఁ డగపడఁడయ్యె. ఇందున కేమి కారణము? మందమతి నైన నే నతఁడు రమ్మనినవేళకు రాకపోవుటచేతఁ గొంతసేపు నాకొఱ కిందు వేచియుండి యెట్టకేలకుఁ గార్యభంగమగునని విసిగి తనపనిమీఁదఁ బోయియుండును. (ఆలోచించి) ఇతం డెం దరిగియుండును? ఎందరిగె ననవేల? సత్యభామపై నతనికిఁ గల యనురాగాతిశయము బట్టిచూడ రుక్మిణీదేవిని వంచించి యతఁ డాదేవియంతఃపురమున కరిగి యుండునని తోఁచుచున్నది. ఈ మహానుభావున కింతికన్న నా సహాయము కావలసిన పను లేవియుండును? నే నెంతసేపని యిందుం గని పెట్టుకొని యుందును? అయినను నిప్పు డెంతప్రొద్దున్నదో చూతము. (ఆకసముఁజూచి) అయ్యో! ఎంతమూర్ఖుఁడను? ఇపు డెంతో ప్రొద్దున్నదను కొంటిని. తెల్లవారవచ్చినది. అదిగో:—

చ. కలకలవేఁగుచున్నయది కమ్మఁగవీచెఁ బ్రభాతవాయువు
ల్గొలకొలలేచికూసెడు శకుంతతతు, ల్జలజారిబింబము

స్వేలకెలఁ బోవుచున్నయది, వేగ వినోదయసూచకంబుగా
నలవడె నింగిఁ దూర్పుదెస నల్లవె రేఖలు చిత్రితైఖరిన్.

మరణమునకు సిద్ధముగనున్న మనుష్య చైతన్యమువలెనె యీ వెన్నె లయుఁ గ్రమక్రమముగ నదృశ్యమగుచున్నది. రాజ్యభ్రష్టుఁడయి పర భూములఁ దలదాఁచుకొనఁబోవు రాజువలె నీ చంద్రుఁడు కళావిహీనుఁడై యపరాంబుధికిఁ బోయెడును ఈకృష్ణుఁడు తెల్లవారుచున్నప్పటికయిన రాఁడా? ఈ ప్రజాగరణముచేత నాకన్నులు తాగినవాని నేత్రములట్లు మూఁతలు పడుచున్నవి. కావున నీ బండిగురివెందచెట్టుక్రింద నొకించుక సేపుఁ గూర్చుండెదను. (అట్లు చేసి కునికిపాట్లు పడుచున్నాఁడు.)

(తెరలో) రుక్మిణీ! నీ నాథుఁ డిందు లేడమ్మా! కానిమ్మచ్చట నెవరో కూర్చున్నట్లు తోఁచుచున్నది. వారి నడిగివచ్చెద నుండుము.

(రుక్మిణి చెలికత్తె యగు హంసపదిక ప్రవేశించుచున్నది.)

కైర.—ఆవచ్చెడువారెవరో? వాసుదేవుఁడు కాఁడుకద! ఊఁ! ఎవ రయిన నాకేమి?

హంస.—(తనలో) రుక్మిణీవంచకుఁ డగు వాసుదేవునిజాడ నెవరి నడిగి తెలిసికొందును? ఇదిగో యీ చెట్టుమొదట నెవ్వరో కనఁబడు చున్నారు. (పరికించిచూచి) ఓహో! శ్రీకృష్ణుని వేడుక చెలికాఁడును, బ్రహ్మచారియుఁ గల్లలకుఁ బుట్టినిల్లు నగు కైరవుఁ డిందుఁ గొండ ముచ్చువలెఁ గూర్చుండి కునికిపాట్లు పడుచున్నాఁడు. వీని నెట్లయిన నిచ్చకపుమాటల మెప్పించి నేను హంసపదికనని యితనికిఁ దెలియకుండ మెలఁగి కృష్ణుని రహస్య మెఱింగెదను.

కైర.—(తనలో) అడుగులచప్పు డామహానుభావునిదే కాఁబో లును. (వినుట నభినయించి) కాదు. కాదు. అందెలచప్పు డగుచున్నది స్త్రీవలె నున్నది. ఎవరైననేమి? నాకన్నులు మూఁతలు విడుటలేదు. నేనుం జూడఁజాలను. (కునికిపాట్లు పడుచున్నాఁడు.)

హంస.—(సమీపించి) అయ్యా కైరవా! ఇచ్చటకూర్చుండి కునికిపాట్లు పడుచున్నావేమి?

కైర.—(తనలో) హాయిగా నన్ను నిద్రపోనియ్యక లేపవచ్చిన

యీపిశాచి యెవ్వరు చెప్పుమా? కంఠధ్వనిం బోల్చిచూడ సత్యభామ చెలికత్తె యగు కనకలతవలె నున్నది. (ప్రకాశముగా) ఓసీ కనకలతా! ఈప్రభాతమున నీవిందేల వచ్చితివే?

హంస—(తనలో) నన్నితఁడు కనకలతగా భావించుచున్నాఁడు; కృష్ణుని రహస్యములు వీనినోటం బ్రేలించుట కిదియే మంచి సమయము (ప్రకాశముగా) అయ్యా! మీ ప్రియమిత్రుని సందర్శనార్థమై యిందు వచ్చితిని.

కైర—ఏమే! నీటక్కరితనము. వాసుదేవుఁడు సత్యభామాంతఃపురమునఁ బవ్వళించియుండఁగా నీవాతని నిమిత్త మిక్కడికి వచ్చితి ననెదవేమి?

హంస— (తనలో) ఈతఁడు తన మిత్రుని గుట్టు వెళ్ళడిబెట్టినాఁడు. ఈతనినోట నుండి యింకను గొన్నిమాటలు పలికించెదను. (ప్రకాశముగా) అయ్యా! నేను పరిహాసార్థమట్లంటిని. వాసుదేవుఁడు మాదేవి మందిరముననే యున్నవాఁడు. కాని, నీ సహాయము చేతనే యీలాభము కలిగినదని మాదేవి మీకు వందనములు చెప్పుమనఁగా నిట్లువచ్చితిని.

కైర—ఎవరిసహాయ మయిననేమిలే! రుక్మిణి గర్వభంగమైనది ఆమె చెలికత్తెయగు తోత్తుకూతురు హంసపదికకు గట్టిపరాభవమైనదని నేను సంతసించు చున్నాఁడను. ఇంక నీవుపో.

హంస—చిత్తము (తనలో) శ్రీకృష్ణుడు సత్యభామాంతఃపురమున కరుగుటయు నీ కపట బ్రహ్మచారికి నామీఁదను రుక్మిణి మీఁదను, జాల కోపముండుటయు నెఱింగితిని. నే నిప్పుడేపోయి వైదర్భికీ వార్త లెఱింగించెదను. (అనిపోవుచున్నది.)

[అప్పుడు శ్రీకృష్ణుడు ప్రవేశించుచున్నాఁడు.]

కృష్ణు— (తనలో) నేను లోకావనకార్యపర్యాలోచనంబునకై నిన్నటిరేయి ననన్యవిదితంబు లగు వ్యాపారంబుల బ్రవర్తిల్లుచుండ నంతఃపురకాంతలును బంధుమిత్రులును నన్నన్యథా తలంచి యనుమానించు చుందురు. అందు ముఖ్యముగా

ఉ. వనిటవేదియందు హృదయేశుఁడు నన్విరహార్తి ముంచ నేఁ
డే నలినాక్షినో గవయనేగె నటంచును నూర్పుల న్వరి
మ్లానముఖారవింద యయి మానిని రుక్మిణి నన్ను దూరుచు
న్నానతి మాత్రపీడనమున న్నిశఁ బుచ్చుగఁ బోలు నెట్టటో.

నామదన సామ్రాజ్యమంత్రియగు కైరవుఁ డెందున్న వాఁడో? రుక్మిణీ ప్రముఖకాంతలెత్తెఱంగున నుత్తలపడుచుందురో వీనిముఖంబునఁ దెలియవచ్చును. అదిగో (చూచి) ఆచెట్టుక్రిందను గూర్చున్నవాఁడు. నేనిందు వీనిని నిరీక్షించి యుండు మనుటచే నే నరిగిన సంగతి యెఱుంగక యింకను నారాకకై యెదురుచూచుచు నీ చెట్టుక్రిందనే యితఁడు కూర్చుండియున్నవాఁడు కాఁబోలును! (సమీపించి మీఁద చెయ్యి వైచి) ఓసి నిద్రాదేవి ప్రియకుమారక! ఓకుంభకర్ణానుజ! లేలెమ్ము.

కైర—(కన్నులు విప్పకయె) అబ్బా! చంపుచుంటివి ఎవరునీవు?

కృష్ణు—నేను నీప్రియ మిత్రుఁడనోయి మూర్ఖుఁడా! లెమ్ము.

కైర—ఓహో! దయచేసినారా? (కన్నులు నలుపుకొనుచు) నా మాట యిప్పటికైన జ్ఞప్తికి వచ్చినదే. మీ కిప్పుడే జామురాత్రి యై యునది కాఁబోలును? నీ విప్పుడో వత్తువో యింకనే వత్తువోయని నీ నిమిత్తము వేచివేచి తుదకుఁ బ్రాణమువిసిగి యీచెట్టుక్రిందఁ జతికిలఁబడితిని.

కృష్ణు—నీవు తడవు మసలుటచేఁ గార్యభంగ మగునని నేను త్వరపడవలసెఁ గావున క్షమియింపుము. కాని, మిత్రుఁడా! లోకరక్షణభారము పై నిడుకొన్నవారి జీవయాత్ర దుఃఖభాజనముకదా!

కైర—ఇట్లగుటచే నీవు లోకవ్యవహారపర్యాలోచన పరుఁడవై రాత్రి జాగారము చేసితినని చెప్పెదువా యేమి?

కృష్ణు—అందుకు సందేహ మేమి?

కైర—అంతయు సందేహమే. నీమాటలు నమ్మువారెవరు? నీమేని బడలికయు నీనడకల తడఁబాటును, నీకన్నుల యెఱ్ఱదనమును జూచిన వారందఱు ని న్నన్యథా భావింపకమానరు. సత్యభామాదేవి

మెప్పించుటకై నీ వరిగియుందువు. మఱియొక వ్యాపారమైన నింత రహస్య మెందుకు?

కృష్ణు — నీవే యిట్లనుమానపడిన బేలలగు రుక్మిణి మొదలగు వారలనింకఁ జెప్పనేల? నీ కనుమానమున్న భయము లేదుగాని నీ మన సునన్న యీ దురభిప్రాయమును వెల్లడిసేయలేదుగదా!

కేర — (తెల్లబోయి) అయ్యో! నేనా బండిగురివెంద చెట్టు క్రిందఁ గూరుచుండి కనకపాళ్లు పడుచుండఁగా నెవరో వచ్చి నన్నుఁ బలు కరించిరి. ఆవచ్చినది సత్యభామాదేవి చెలికత్తెయగు కనకలత యనుకొని నేను గన్నులు తెఱవకయే దానితో నేమేమొ యంటిని. అదియును రెండుమూఁడు మాటలాడి తొలగిపోయెను. ఇందువలనఁ బ్రమాద మేదియు లేదుగద!

కృష్ణు — అయ్యయ్యో! మూర్ఖుఁడా! ఎంతపని చేసితివి? నీకడకు వచ్చినది కనకలత కాదు. అది కొన్నిదినములనుండి యిచ్చట లేనే లేదు. నీవద్దకువచ్చినది రుక్మిణి చేటికయగు హంసపదిక యయియుండును. రుక్మిణి తన చెలికత్తెవలన నీమాటలు విని నాపై నలుకఁబూనును. నీవు నన్ను నిష్కారణముగ దేవికనాగ్రహపాత్రునిఁ జేసితివి.

కేర — అయ్యో! నేను సహజముగ మందమతిని. అందు పై నిద్రలేమిచేనున్న మఱియుఁ జెడను. దానికిఁ దోడు కునికిపాట్లు పడుచు నోటికివచ్చినట్లు ప్రేలితిని.

కృష్ణు — ప్రేలినఁ బ్రేలితివి కాని ప్రమాదమైన సంభాషణ మే మియుఁ జేయలేదుగద!

కేర — లేదయ్యా! ఏమాటయుఁ జెప్పలేదు. ఏమో? నాకు జ్ఞాపకములేదు సుమా! అయిన నట్లుచెప్పుదునా? ఏమో? చెప్పనువచ్చును. ఎవరితో నెట్లుమాట్లాడవలయునో నాకుఁ దెలియదా? ఏమో తెలియ దేమో? ఊఁ తెలిసియే యంటినేమొ? ఏమయిననేమి నాకు జ్ఞాపకములేదు.

కృష్ణు — అట్లయిన నిప్పుడేమి చేయుదును? మనమిప్పు డామె సన్నిధి కరిగి నిజమెఱింగింతమా?

కైర—స్త్రీల మనములు సహజముగఁ బురుషులను శంకింపుచుండును. ఇప్పుడు మనము నిజస్థితిని వక్కాణించినను మన మిద్దఱము గలసి తనను వంచించినార మని యెంచుంగాని రుక్మిణీదేవి మన మాటలు నమ్మదు. ఇంతకు నొకరినవం బనియేమున్నది? నాగరికులు మంచిపనికావు.

కృష్ణు—అవును—

తే. గీ. సతులమనము లద్దములట్లు స్వచ్ఛములయి
యెదుటఁబడువాని వడిగ గ్రహింపుచుండు
నెడఁద ననుమాన ముదయించె నేని మఱలఁ
గలకఁ దేర్చుట మిక్కిలి కఠినతరము.

కావున నీ యవివేకమువలన మనో వైకల్యంబు నొందియుండు దేవిని మన మిరువురం బ్రసన్నురాలిం జేసికొందము రమ్ము. అదిగో భగవానుఁడైన సూర్యుఁ డుదయించు చున్నాఁడు.

కైర—అదిగో భగవానుఁడైన చంద్రు డ స్తమించుచున్నవాఁడు. ఈసూర్య చంద్ర బింబములు కాలపురుషుఁ డను నర్తకునిచేతి తక్కెడ సిబ్బులట్లున్నయవి.

కృష్ణు—అవును.

చ. వనజహితుండు తోఁచి యదే ప్రాకెడు మీఁదికి నాకసంబుపై
వనజవిరోధి తాఁనపరవారధిఁ జేరగఁ బోవుచుండెడు
న్నొనకొని మీఁటద్రొక్కుతరి ముందుభాగము మీఁది కేగిన
న్వెనుకటి ప్రక్క క్రిందకును వేగమె పోయెడు లీలఁ గైరవా.

పోవుదము రమ్ము. (అని నిష్క్రమించుచున్నారు.)

(రుక్మిణియు హంసపదికయుఁ బ్రవేశించుచున్నారు.)

రుక్మి—ఓసీ! హంసపదికా! కైరవుని వచనములయందు మనము విశ్వాస ముంచవచ్చునా? ఇయ్యది నిజమగునేని యాసత్యభామా విధేయునిచేత నేను నిష్కారణముగ వంచింపఁబడినదాన నగుదును.

హం—అమ్మా! బహుకాంతావల్లభులఁ జెట్టఁబట్టినవారల యవస్థ లిట్టివే. విచారించిన ఫలములేదు. కావున నీవీచంద్రకాంత వేదికపై గూరుచుండుము. నే నాయనజాడ లింకను నరసివచ్చెదను.

(రుక్మిణి కూరుచున్నది. అప్పుడు కృష్ణకైరవులు ప్రవేశించుచున్నారు)

కృ—అదిగో! విదర్భరాజనందన విమనస్కయై కూరుచున్నది.

ఉ. ఈమదిరాక్షియల్క నిపు డేమిట దవ్వుగఁ దోలువాఁడ నే
నీమె మొగంబు కోపమున నెఱ్ఱదనంబునుఁదాల్చి యొప్పు కెం
దామరపువ్వులాగు పతిభార్య మెండం దలపోసి పొక్కు నీ
భామను నమ్మికన్ల్పాడముభంగి నీవే జరెంపఁ దావలె.

మిత్రుఁడా కైరవుఁడా! నాకంటెనీవు మునుపామెకడ కరిగి భయాచమత్కారవచో విశేషంబులచే నీపాటలగంధి కోపమ్ముఁ జల్లార్చుము.

కైర సరి. సరి. ఇది నాపాలఁబడినది? ఆమె తనకోపమ్మంతయు నాపైఁ జూపును. (పోయి రుక్మిణి యెదుట నిలుచున్నాడు)

రుక్మి—(చూచి) ఓహో! ఎవరనుకొంటిని? కైరవుఁడా! నీవు వేదుకచెలికాఁడగు నాగోపాలదేవుం డెచ్చట?

హంస—ఈయన వెనుకననే యీయనయు నుండును.

కైర—(తనలో) ఈమె నన్నేవిషయమడిగిన 'నేనెఱుగ' ననిపల్కెదను. కానిచో నోరుజారి యే పొరపాటుమాట వచ్చునో?

రుక్మి—ఊరకుండెదవేల? నీమిత్రుని రక్షించుటకు ప్రత్యుత్తరమును వెదకుచుంటివా?

కైర—ఏమొ నే నెఱుఁగను.

రుక్మి—ఆ వాసుదేవుని సమాచారము నీ వెఱుఁగవు నరే. నీ వెచ్చటి నుండివచ్చితివి?

కైర—ఏమొ నే నెఱుఁగను.

రుక్మి—బ్రహ్మచారీ! నీవెచ్చటినుండి వచ్చినదియునీ వెఱుఁగవా?

కైర—అమ్మా! నావిషయము నడుగనేల విచారించెదరు? నే నిచ్చటనే యుంటిని.

రుక్మి—ఇప్పు డిచ్చటనేయున్నావు. ఈవఱకు నెచ్చటనుంటివి?

కైర—ఇచ్చటనే యున్నాఁడను.

రుక్మి—(నవ్వుచు) నీకుఁ బిశాచము పట్టినదా యేమి? అసంబద్ధములు పల్కెదవు.

కైర—నేనె బ్రాహ్మణపిశాచమునై యందరను బీడించెదను. నన్నుఁ బీడించువారెవరు?

రుక్మి—(నవ్వుచు) ఏమి నీహాస్యప్రసంగములు? (తనలో) ఈ విప్రకుమారుఁడు నాకోపము సగము నల్లార్చెను. అందుచేతనే భర్త ముందుగా నితనిని నా సముఖమున కంపెను.

హంస—ఈ కపటబ్రహ్మచారి వృత్తియే యదిగదా?

(కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కృ—అరరె. ఈ కైరవుని చమత్కారవచన రచనలచే నీమందయాన డెందంబున నాగ్రహంబు వాసి మందహాసము చేయుచున్నది. మరల నాచర్యలఁదలఁచి యీయంచయాన కోపించుటకు మున్నె నేను తదీయసముఖమున కరిగెదను. కైరవుఁడు మంచి సమయము కల్పించెను. (రుక్మిణిని సమీపించుట.)

కైర—(తనలో) అదిగో! నామిత్రుఁడు వచ్చుచున్నాఁడు. ఈమె యేమనునో?

హంస—[చూచి రుక్మిణితో] అల్లదిగో స్వామివారు సొక్కుచు సోలుచు దయసేయుచున్నారు. [కృష్ణునితో] ఈమె రుక్మిణీదేవి. విదర్భరాజనందన. దేవరకు భార్యయని లోకులు చెప్పుకొందురు. జ్ఞాపకమున్నదా?

కైర—[మెల్లగా] ఓసీ! ఆమెకు లేనికోపము నీకెక్కడనుండివచ్చినదే?

రుక్మి—[పీఠమునుండిలేచి] ఓసీ! ధూర్తులారా! మీ యవినయము చాలును. ప్రియా విరహముచేత వ్యథనొందుచున్న యీ మనంబునకు మరింత తాపమేల గలిగించెదవు?

కృ—దేవీ! నీవు సత్యమ్ము నచించితివి. ప్రియురాల వైన నీవిరహ ముచేతనే నేను వ్యధనొందుచున్న వాఁడను. నే నట్లున్నను;

సీ. చెలువ నీవదనంబు చిన్నవోవఁగ నేల
కాటుక రేఖలు కరుగనేల?
యాణిముత్యము లట్లు లశ్రువు ల్పడనేల?
చీకాకుపడి కురు ల్చెదరనేల?
మానసం బనయంబు మఱుఁగు చుండగనేల?
జడను గూర్చినపూలు జాఱనేల?
నవనవాంగకములు నవసిపోవఁగనేల?
బొమ లిట్లు జంకించి ముడుపనేల?
అనపరాధిని నామీఁద నలుగఁ దగునె?
చెలువ నీకెగ్గు నేను చేసితినయేని
చెఱకు విలుకాని విల్లును విఱిచినట్లె
తేటినారి పుటక్కునఁ దెంపినట్లె.

కైర—ఇంతగొప్పయొట్టు పెట్టుకొనినప్పుడు మీరీయన నేమియు ననరాదు.

రుక్మి—ఈసమయమున కేమికాని చెలియలు సత్యభామ మీావి యోగమించుకయు సంహింపజాలదు. కావున మీారింత వేగముగరాఁదగదు.

కృ—(తెల్లబోయి) ఆ! సత్యభామా? ఎవరీ యసత్యకల్పనము జేసి నీమెప్పు వడయఁదలఁచిన వారు? నేనామెను జూడనైనలేదే.

రుక్మి—ఆమెనుగాదు. నన్నుం జూడలేదని పల్కుఁడు. అట్లయిన కైరవుఁడు హంసపదికతో నబద్ధము చెప్పెనా?

హంస—ఇతఁడు నిశ్చయముగ నాతో నట్లె చెప్పెను.

కైర—అయ్యో! నాప్రాణముమీఁదికి వచ్చినదోయి దైవమా!

కృష్ణు—కైరవా! నేను సత్యభామామందిర ప్రవేశము సేయుని దె ట్లెట్లు చెప్పితివి?

కైర—అబ్బే—నేనీమెతో నట్లు చెప్పలేదండి.

హంస—ఛీ! ఆబండిగురివెందచెట్టుక్రిందనాసీనుఁడవై చెప్పలేదా?

కృష్ణు—(తనలో) ఈయవసరమున నీవిప్రవటుఁ డెట్లు తప్పుకొనునో?

కైర—అట్లయిన నే నప్పుడేమి చేయుచుంటిని?

హంస—నిద్రించుచుఁ గుంభకర్ణునిఁ దిరస్కరించుచుంటివి.

కైర—మఱింకేమి? నిద్రాసక్తుఁడగు వాని ప్రలాపంబులును, జ్వరముచేఁ బీడితుఁ డగువాని పలుకులును, నున్మత్తుని వాక్యంబులును మత్తువస్తువులు భక్షించినవాని వచనంబులును విశ్వసింపఁదగినవి కావు. అందుచేత నామాటలబద్ధములు. ఈయన వెళ్ళనులేదు. నేను జూడనులేదు.

రుక్మి—అహహా! నీవు చమత్కార వచనములచేత నిజ మబద్ధమును, అబద్ధమును నిజమునుఁ జేయఁగలవు. బొంకనను నీవలె నేర్పుగ బొంకవలెను.

హంస—ఈయనను జూడ నసత్యదేవతయే యిట్లవతరించినట్లు నాకుఁ దోఁచుచున్నది.

కృ—ఓవిదర్భ రాజనందనా! ఈ విషయంబున కింతవిచారాక్రాంతస్వాంతవుగా నేల? నీకు నిరంతరదాసుఁ డగు నీజనుని నన్యథాబుద్ధిఁ దలంచుట భావమగునా? నాచేసిన యపరాధమునకుఁ గారణము లేకపోలేదు.

రుక్మి—అయ్యయో! మీరు నాకు దాసులు నానేల? సత్యభామకుఁ గావలయును. తదితర సపత్నులకుఁ గావలయు.

కృ—దేవీ! సకలగుణరత్నంబులకు గనియగు నీకు దాసుఁడను గావలయును గాని యన్యుల కేల? ఇంక శాంతించి నామనవి యనుగ్రహించి నన్నేలుకొనుము.

(గడ్డముపట్టుకొని బ్రతిమాలుకొనుట.)

రుక్మి—(చేయి తీసివేయుచున్నది.)

కృష్ణు—ఓకళ్యాణి! నా పలుకుల నొకించుక విందువేని నీవు నన్ననుగ్రహింపకపోవు.

రుక్మి—అనుగ్రహించుటకు ననుగ్రహింపక పోవుటకు నే నెంత దానను?

కృష్ణు—సౌంభకుఁ డనురాట్సేశ్వరుఁడు బదరికాశ్రమతాపసు లకును, నితర సాధుజనంబులకును మహాపకారము సేయుచున్నాఁడట! అతని బారికోడి తపోధనులందరు దుష్టశిక్షణం బొనరించి లోకముల ననుగ్రహిం పుమని జాబాలి యను మునికుమారునిచేత నాకు సందేశమంపిరి. ఆముని కుమారుఁడును సందేశ మెరిఁగించి మునిద త్తములును దానవ విజయ సాధనములును నగు దివ్యాస్త్రంబులఁ గొన్నిటిని నా కుపదేశింప దలంచి నియమస్థుండనై యేకాంతప్రదేశమునకు వచ్చునదియని నా కానతిచ్చెను. తదాదేశంబున నేనెవరికి దెలియకుండ నరిగి నిన్నటిరేయి దత్కార్యంబున నిర్వర్తించితిని. కయిరవుడది యెరుంగక నేను సత్యభామా మందిరమునకు బోయి యుందునని యూహించి య ట్లసందర్భముగ బలికె. ఆపలుకులు హంసపదికముఖంబున విని నీవు నాయం దపరాధ మారోపించితివి. ఇంత కన్న నాయొనర్చిన నేరములేదు.

కైర—అమ్మయ్యా. ఇప్పుడు నేను బ్రతికితిని. మిత్రుడా! ఇది నీవు రహస్యము చేయుటచే మంచిపనిచేసితివి. అట్లుగాకది యీకాంతల కెరిగించిన నేకాంతములోకాంతముపర్యంతమీపాటికి వ్యాపించియుండును.

హంస—నేనిప్పుడు కలహకారిణినయి యపరాధంబు జేసితిని.

రుక్మి—ఓసీ! నీవుకావు. నేనే ప్రాణేశ్వరునియెడ నవినయ మొన ర్చితిని.

కృ—దేవీ! నీవు విషాదమొంద బనిలేదు. కాంతలలుకబూనియు దర్శనీయులయి యుందురుగదా!

చ. కమలదళాక్షి నీదు తెలిగన్నులఁ గెంపుజనింప నాదుధా
 రమునకు నీసుజెంది చలితాధరవాచు నరాళమైన క
 న్బొమ ముడిచేత నాకుభయము నలిగింపుచు నుండియు న్మనో
 జ్ఞమగువిలాసము న్దొలిపి సల్పితివా కనుపండు వ త్తరిన్.

ఇప్పుడు నీవు ప్రసన్నురాలవగుటచే నేను ధన్యుడ నైతిని. మరియు;

తే. గీ. సంజకెంజాయ మెలమెల్ల జారుచుండ
 స్వచ్ఛమై తోచు చంద్రబింబంబు పగిది

నలుక నెడబాయ నీవదనారవింద
మమలమై తోఁచు నిప్పుడో యంబుజాక్షి!

కైరవా! నీవుపోయి నాయాగమనంబు బలదేవాదుల కెరిగింపుము.

కైర—చిత్తము (తనలో) ఇప్పటి కీగండముగడచినది. బహు కాంతామనోహరుడగు దొరను సేవించుటకంటె వనవాస ముత్తమము (అని నిష్క్రమించుచున్నాడు.)

హంస—అమ్మా! నేనునుబోయి యంతఃపురకాంతలకీశుభవర్తమానమెఱిఁగించెదను. (అని నిష్క్రమించుచున్నది.)

కృష్ణు—(తనలో) ఈయుపవనవీథుల నీమెతో విహరించియింకను బ్రిసన్నురాలిఁజేసెద. (ప్రకాశముగా) దేవీ! మనోహరములైన యీ ప్రభాతవాయువుల ననుభవింతము రమ్ము.

రుక్మ—చిత్తము. ఈ మందమారుతము దేవరవారికిఁ బ్రజాగణమునఁ బుట్టిన బడలిక నపనయింపఁగలదు.

కృ—(కొంచెముదూరము నెళ్ళి) సుందరీ! ఇటు చూడుము.

ఉ. అడుగునసల్లనై పయికిపట్టరుణాబయి దర్శనీయమౌ
యొ్యడు గురివెందగింజఁగను మిందునిభాసన దుషచిత్తుఁడి
వ్వడువున నింద్యమైన తనవర్తనమంతయుఁ గప్పిపుచ్చుక
న్నడుఁ బరిశుద్ధజీవనునిభంగి జగంబును మోసపుచ్చుచున్.

రుక్మ—ప్రాణేశ్వరా! దానికన్నఁ జిత్రమిది వుంభావించిన చీఁకటి యట్లొప్పెడు నీతమాలవృక్షము వీక్షింపుఁడు.

కృ—అది యాకృతిచేత నల్లనయ్యు గుణములచే స్తోత్రపాత్రం బయ్యెడును. చూడుము.

చ. గమగమతావుల న్దెసలఁ గ్రమ్మెడి కస్తురి నల్లనయ్యు, శ్రా
వ్య మధురనాదము ల్దొరయఁ బల్కెడికోయిల నల్లనై, యమూ
ల్యముగద యింద్రనీలమణి, యాకృతిఁబట్టి గుణాగుణంబుల
న్క్రమముగ నిర్ణయించుట దురాసదమౌఁజుమి యెట్టివారికిన్.

(తెరలో)

హంసపదికా! వాసుదేవుం డెందున్నవాఁడు? ఏమనుచున్నావు? రుక్మిణీసహితుండై యిందు విహరించుచున్నవాఁడనియా? సరే.

రుక్మి—ఎవరో వచ్చుచున్నారు. (నిరూపించి) సత్యభామ చెలి యగు రమణిక మానిమిత్తము కాఁబోలు వచ్చుచున్నది.

(రమణిక ప్రవేశించుచున్నది.)

రమ—(తనలో) సత్యభామ సందేశమును రుక్మిణి యెదుటః శౌరితోఁ జెప్పవచ్చునా? కూడదా? యని నామనంబు శంకించుచున్నది. అయిననుఁ జెప్పకూడని దిం దేమున్నది? (సమీపించి) దేవా! దేవీ! మీయిరువురకును సుప్రభాత మగుంగాక!

రుక్మి—రమణికా! యిటు రమ్ము.

కృ— రమణికా! దేవి సత్యభామ నా నిమిత్త మత్యంతము కళవళపడియెఁ గాఁబోలును.

రమ—మల్లెపూ నెండఁ బడినప్పు డది వాడినదా యని నేత్రే యడుగ నేల?

కృష్ణు—అందుచేత నీవిప్పుడ యరిగి నారాక నెఱిఁగించి యామెను స్వస్థచిత్తురాలిం జేయుము.

రమ—జాగరముచే నవసిన మీముఖారవిందముఁ జూడక యామె స్వస్థచిత్తురా లెట్లగును? ఆమె మీతో నిట్లు విన్నవింపుచున్నది. "దేవా! మంగళప్రదమగు మీదర్శనమొసఁగి యక్క రుక్మిణి యలమటఁ బాపిన చందముననా సంతాపంబునుఁగూడ నపనయించి సంభావింపవలయును" అని.

రుక్మి—(తనలో) ఇప్పుడు ప్రాణేశ్వరుఁడు దీనివెంట సత్యభామ యింటి కరుగునా యేమి?

కృష్ణు—(తనలో) ఇప్పు డామె కేమిసందేశ మంపుదును? ఏ మాటలాడిన నీరుక్మిణి యేమిగా భావించునో? అయిన నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) రమణికా! దేవి సత్యభామతో నాపలుకులుగా నిట్లు పలుకుము. "దేవీ! అవరోధజనంబులనెల్ల నందు ముఖ్యముగ నిన్నును

నెప్పుడు చూతునా యని నాచిత్తంబు దత్తరపడుచున్నది. కైరవప్రి యుపప్రమాణవచనంబులు నీమనంబునను బాధింపకుండుం గాక!"

రమ—తన ప్రమాదమునలనం బుట్టినకళనళ మంతయుం గైర వ్యుండు మార్గమున నెదురుకొని నా కెరింగించెను.

రుక్మి—అతడు మాపాలిటికి నేం డపరనారదుం డయ్యెను.

[తెరలో గానము వినబడుచున్నది.]

రమ—ఎచ్చటనో వీణానాదము వినంబడుచున్నది.

కృష్ణ—(చెవియొగ్గి విని) అది నిశ్చయముగ గానకళావిశారదుం డగు నారదుని వీణానాదము. అదిగో! అమరమునీంద్రుడు మహతి యగు వీణను పాణిని ధరించి లలాటభాగంబున నూర్ధ్వపుండ్రము దిద్ది దండకమండలశోభితుండై వల్కలధారియై మత్సమీపమున కేతెంచుచున్న వాడు. ఈమహాత్ముండు కలహప్రియుండు.

రుక్మి—అందుచే నెవరెవరి కెట్టికలహంబులు పెట్టునోయని నె మ్మనమ్మున సందియము కలుగుచున్నయది.

(పైన చెప్పినట్లు నారదుండు ప్రవేశించుచున్నాడు.)

నార—(తనలో) సమస్తప్రపంచంబునం గల సురాసురమనుష్య లోకంబులకుం గలహంబు లనేకపర్యాయంబులు గల్పించితిని గాని యీ యాదవచంద్రుని భార్యకుం బోరాటంబు మనసారం గల్పింపనైతిని. నే నిప్పుడు రుక్మిణీసత్యభామలకును శ్రీకృష్ణసత్యభామలకును గడపెట్టెద. అందువలన నాచమత్కార మెల్లనుం దేటపడంగలదు.

(కృష్ణుని సమీపించుట.)

కృష్ణ—(రుక్మిణితో లేచి) మహాత్మా! నారదమునీంద్ర! భార్యా సమేతుండనై నమస్కరించుచున్నాండను. (నమస్కరించును.)

నార—ఈప్సితార్థ సిద్ధిరస్తు!

కృష్ణ—దేవా! ఆచంద్రకాంతోపల వేదికపై దయచేయుండు.

నార—అందరమునుం గూర్చుందము రండు.

[శ్రీకృష్ణుడును రుక్మిణియు నారదుడును వారివారిపీఠములగూర్చుండిరి.

రమ—(తనలో) నారదమునియని జను లనుటయేకాని యెన్నఁడు జూచి యెరుఁగను. కొంచెము తడ వింధుండి యీ మహాత్ముని వచనామృతమును వీనుల గ్రోలి ధన్యురాల నయ్యెదను.

కృష్ణు—దేవా!

ఆ. వె. మెఱుపులేనివెలుఁగు, మేఘోదయములేని
వాన, పూవులేని ఫలముసూనె
రాకపోలునీదు రాక మౌనీశ్వర !
కనులపండు వయ్యెఁ గలుష మడఁగె.

నార—జకదేకగురూ! భారతీనాథ నాగభూషణ పులోమజాధీశ్వరప్రముఖగీర్వాణాధిపులెల్ల నీమహామహిమ మెఱుఁగలేక యనంతశ్రమలఁ జొరయుచుండ మాయాస్వరూపుఁడవై యాదినారాయణుఁడవై, కారణజన్ముఁడవై సృష్టి, స్థితి, ప్రళయహేతుభూతుఁడ వగునీవు నన్నిట్లు సంభావింపనేటికి?

సీ. విశ్వపావనమైన వినువాఁక యెవ్వాని
యడుగుదమ్ములఁ బుట్టునలరు దేనె
భువనభారముఁదాల్చు భోగీంద్రుఁ
డెవ్వాని పవళించు మెత్తని పట్టుపాన్పు
అమృతంబు వొడమిన యంభోధి
యెవ్వాని రాణివాసములుండురాచనగరు
పరమేష్ఠియావిర్భవంబున కెవ్వాని
పొక్కిలి పొందమ్మి పురిటియిల్లు
ప్రాణినుకు లెల్ల నెవ్వాని వరగుణాళి
పరుసఁ గై వార మొనరించు వందిగణము
అట్టె నినుఁగాంచి ధన్యుఁడనైతి నిప్పు
డఖిలకళ్యాణగుణసాంద్ర! యాదవేంద్ర!

మ. ధరణీభారము మాన్పఁగాఁ దలఁచి యూర్జైత్యాధమా నీక సం
హారణంబుం బొనరించు వేడుకను శ్రీమద్దేవకీగర్భ సా

గరరాకాశరదిందుమూర్తి వయి లోకంబందు జన్మించు యె
గ్గరదోసంబులు బాపుచుండెదవు లీలామానుషా! మాధవా!

కృ—ఓజగద్వందితకీర్తీ! దేవరవా రెచ్చోటనుండి దయచేసితిరి? మమ్మేకతమున ధన్యుల జేయదలంచితిరి? మహాత్ములూరకరారే.

నార—దేవా! నిజావతారంబుచే యదుకులంబు ననుగ్రహించిన శ్రీమన్నారాయణుండవగు నిన్నును సకలనారీమండలమునందును ముఖ్యముగ నీయంతఃపురకాంతా జనంబునందును సద్గుణగరిష్ఠయు నగ్రగణ్యయు నని పొగడ్తగాంచిన యీవిదర్భరాజనందనను గన్నులకరవుదీరనొకమారు వీక్షించుటకును నీడునకు జోడునకు దగియున్న యీదంపతులను నాయొనర్చినసపర్యల దనుపుటకును వచ్చితిని. మున్నిమెనుంగూర్చి నే వినిన దంతయు యదార్థంబయ్యె. మర్త్యాంగనలమాట యేల? దేవతాంగన లయిన నీమె కాలిగోరునకును బోలరు.

రమ—(తనలో నసూయతో) రుక్మిణిని బొగడుట సత్యభామాదుల నిరసించుటయే.

కృ—దేవా! మీావచను ముపచారమాత్రము కాదు. మీారు నిజమునే వక్కాణించితిరి.

రుక్మి—(నమ్రతతో) మీాయిరువురి దయారసం బట్లు వెల్లివిరి యుచున్నది. కాని నేను మీాపొగడ్తకు దగను.

నార—దేవా! భగవంతుడ వగు నిన్నూరక దర్శింపరాదని యమరలోకంబునుండి వచ్చుచునందలి పారిజాతసుమం బొండు తెచ్చితిని. మాబోటి మునులు మిముబోంట్లకు సమర్పించునవి పుష్ప, పత్రి ఫల తోయములుగాక మరియేమున్నవి? (పుష్పమిచ్చుచున్నాడు)

కృ (దోసిలి యొ పుచ్చుకొని) మహాప్రసాదము. స్వామీ అమరపుష్ప ప్రాప్తిచే గృతార్థుడ నయితిని.

రుక్మి—(తనలో) శచీదేవి ధరియించ నర్హ మగు నీకుసుమము కొప్పునం దురుము కొనగలుట మహాభాగ్యము. దీనిని నా కొసంగునని ప్రాణేశ్వరు నడుగుటకు నడుగక పోవుటకుగూడ మనస్కరింపకున్నది. అయినను దానిని వినియోగించునేర్పు భర్తయే యెఱుగును.

రమ—(తనలో) ఈపుష్పమునుధరించుటకు మాసత్యభామ కన్న నర్హులేరును లేరు.

కృ—(తనలో)

ఉ. ఈముని పారిజాతసుమ మేటికి దెచ్చి యొసంగె నాకు? నే
నేమదిరాక్షికిత్తు నిది! యెవ్వరికిచ్చిన నేమి వచ్చునో?
భామ విదర్భరాజసుత ప్రక్కనె యున్నది యామె కిచ్చినన్
గోపలి సత్యభామ కడు గోపన యగ్గకపోదు నాపయిన్.

నార—ఏమి! వాసుదేవా! ఏమి యాలోచించుచున్నావు?

కృష్ణు—ఈకుసుమ సౌరభమున కద్భుతపడుచుంటిని. (తనలో) నాయిచ్చనచ్చిపల్లు సలుపకుండ నీరమణిక యేల రానలయును? వచ్చినది తత్సమాచారప్రకార మెరిగించి చక్షణమే యేల యరుగదయ్యె? దానిని వెంటనే యనుపకపోవుట నాలోపమే.

రమ—(కృష్ణునితో) దేవా! ఈకుసుమధారణ మసన్యసాధారణమై మాసత్యభామాదేవి తనూవిలాసమునకు మరింత వన్నెదెచ్చును.

రుక్మి.—ప్రాణేశ్వరా! రమణిక యన్నట్లు పారిజాతమును జెల్లెలు సత్యభామ కనుపుట యుచితము.

రమ—(తనలో) ఇంక తప్పకయితడు దానిని సత్యకేయొసంగును.

కృష్ణు—(తనలో) సర్వవిధముల రుక్మిణియె దీనిని ధరింపదగినది. విశేషించి యీయమె యింతకుమున్న నా కీ బూనినయలుకయు దొరగి ప్రసన్నురాలగును. మునియు దీని నన్యథా యోజింపడు. కావున దీనిని రుక్మిణి కొసంగుట కర్తవ్యము.

నార—నారాయణా! నీహృదయేశ్వరియు నీసమక్షవర్తినియునగు రుక్మిణీదేవి కీప్రసూన మర్పింపుము.

కృష్ణు—చిత్తము. (రుక్మిణితో) దేవీ! సకలవిద్యా విశారదులగు నారదుల యనుమతంబునఁ దదర్పిత పారిజాతమును నీకిచ్చెదగ్రహింపుము.

తే. గీ. గరితలందును నీ వగ్రగణ్యురాల
వలరు లందును నియ్యది యగ్రగణ్య

మల్లెగుట దీని నీకిచ్చి యన్నమిన్న
యోగ్యమగు దానిఁ గూర్చితి యోగ్యతోడ.

(పుష్పమును రుక్మిణికి నిచ్చుచున్నాడు.)

రుక్మి—మహాప్రసాదము దేవా! (దోసిలియొగ్గి పుచ్చుకొన్నది.)

రమ—[అసూయతోఁ దనలో] ఈమాధవు డెంత ద్రోహము సల్పినాడు? మాసత్యభామకంటె నీవన్నెలాఁడికడ నేమి సగుణము లున్న వని యితఁడీమె కిది యొసగెను?

కృష్ణు—దేవీ! ఇది నీధమ్మిల్లమున ముడుచుకొనుము. కాదం టమ్ము; నేనె ముడిచెదను. [అట్లుచేసి చిరునవ్వుతో నామె మోము చూచుచున్నాఁడు.]

రుక్మి—[శృంగారలజ్జ నభినయించుచు సంతోషముతోఁ దనలో] ఈసమయమున నావేణియందమునుఁ జూచుకొనుటకు రెండు నిలువుటద్ద ములుండిన బాగుండును. అయినను జూచి యానందింప వలసిన జీవి తేశ్వరుఁడు సముఖముందే యున్నాఁడుగదా!

కృష్ణు—(కొప్పుజూచి) అహాహా! మత్తమాతంగయానా! ఏమి నీ విలాసము!

చ. అలికులవేణిసల్లనగు నంబరవీథినిఁ దెల్లమబ్బు తా
నెలకొని యున్నయట్లు హరినీలమణీమయ భూషణంబుపైఁ
జెలువగు పుష్యరాగమునుఁ జెక్కినయట్లులు నల్లగల్వపై
విలసిలుచుండు బిందు వటునెన్నెదు నీకుసుమంబు కొప్పుపై.

నార—మరియుఁ బార్వతి తాల్చిన యవతంస చంద్రకళవలె నీ మెఱుఁగారుదల నీపుష్పంబు రాజిల్లుచు నీకళ్యాణికి వర్ణనా దుస్సాధ్యమగు సౌందర్య మొకండు దెచ్చెను.

రుక్మి—దేవా! అసమాన విలాసహేతు వగు నీ కుసుమంబు మహి మెట్టిదియో వినఁగోరెదను.

నార—కళ్యాణీ! అడుగవలసినదాని నడిగితివి. వర్ణించెద నాకర్ణిం పుము. యీకుసుమ వసంతముఁ దాల్చు సువాసినులకు నిత్యమంగళ సౌభాగ్య వైభవప్రాభవాదులు లభించును. ఆ యింతి ప్రాణనాథునకు

నిరంత రాభ్యుదయంబు సంప్రాప్తించును. ఇది యేభవనంబున నుండునో యాభవనంబు దేవేంద్ర మందిరంబుచందంబున సిరుల కిరువగుచు మెరయు చుండును. దీని యమితసుగంధంబు శతయోజన వ్యాప్తము. మరియు,

తే. గీ. చందనమె హెచ్చుసకల భూజములలోన
దానికన్నను హెచ్చు సంతానకుజము
దానికి హెచ్చు కల్పమందారతరులు
పారిజాత మిన్నింటికె చ్చుఁ బద్మగంధి.

కృష్ణు—అహాహా! భూలోక పుష్పములకు నమరలోక కుసుమంబులకు నెంత భేదమున్నది! సురమహీజాత జాలంబయి యత్యధిక విఖ్యాతంబగు పారిజాతంబు మీరు మాకొసఁగుటచే మేమిక్షణమును ధన్యులమైతిమి. మా దేహ గేహంబులు పావనము లయ్యెను.

రమ—(తనలో)మాసత్యభామకడ కరిగింపుడీపావనమగి పడును.

రుక్మి—దీనిమహిమ మెంత వినినను దనివి దీఱకున్నయది.

నార—మఱియు నీపుష్పంబు ధరియించువారికి నాఁకలియుం దప్పియు పొడమకుండుటఁ జేసి యన్నపానంబులపై మనసు చనదు.

ఉ. పాణిపదంబుసుమ్మి యిది పద్మజురాణికి, మాపులంపు నిం
దాణికి సెజ్జగూర్చెదరు దైవతకాంతలు దీనితోడ రు
ద్రాణియు దీనిఁ దాల్చు నవతంసముగా ససయంబు, సర్వగీ
ర్వాణవిభూషణం బిదియె పంకరుహాయతచారులోచనా!

రుక్మి—దీని పరిమళమిట్లెంతకాల ముండును?

కృష్ణు—అమరలోక పుష్పమగుటచేత దీనిపరిమళము శాశ్వతమని తలఁచెదను.

నార—అట్లుగాదు. వినుఁడు.

చ. కరము జగంబు నేఁచుచును గాడ్పులు వేసవియందు వీచిన
న్స్ఫురదురుచంద్రికానిశల సొక్కుచు లీల మెయి న్విహారము
ల్సలిపిన లేశము న్నలుగనేరదు వాఁడదు యిట్టులొక్కవ
త్సర మగు దాఁకనుండునఁట తావులు తగుచునుండుఁ బిమ్మటన్.

రుక్మి—ఇంతజగదేక విచిత్రచరిత్రగలపుష్పంబు నాకొసగుటచే నన్నుఁగాంతాజనంబున నధిక గౌరవాస్పదముగనొనర్చితిరి. ఇదినాకును నాసపత్నులకుఁ గలహకారణ మగునేమోయని యించుకశంకించెదను.

రమ—(తనలో అసూయతో) నీకుఁగల్గిన మహదైశ్వర్యమున కోర్వలేక కలహించువా రెవరు? ఇది సత్యభామ కిచ్చినను వద్దు.

కృష్ణు—సపత్నులయం దొక్కరిత కనన్యదుర్లభ మగుగౌరవము లభించినఁ దక్కినవారికి మనంబెరియుట స్త్రీజనంబులకు సామాన్యమే. అయినను నిది యంత కలహకారణముగఁ దలఁపను.

నార—వాసుదేవా! నీవనిన ట్లిది కలహంబునకు విషయంబు కాదు. ఒకవేళ నట్లయినమాత్రము మనమేమి చేయఁగలము? చక్రవాకము విలపించునని భగవానుఁడు చందురుఁడు జగంబులకు వెన్నెలఁ బ్రసాదింపకుండునా? ఈమెకింతయనూనగౌరవము లభించుటచేత నీమె సవతులలోఁ గొందఱోర్వలేనిమాటనిజమే. అందు ముఖ్యముగ సత్యభామ.

కృష్ణు—ఒకరిని నిరూపింపనేల? అందఱు నభిమానవతులే.

నార—అందు సత్యభామ యీర్ష్యాగ్రహపీడితురాలు. ఆమె జగత్త్రయంబునఁగల కాంతలలోఁ దానెచక్కదనంబున నిక్కననియు సద్గుణంబులకు తావనియు నభిమానంబునకుఁ గాణాచిననియు భావించుకొని యెనలేనిగర్వంబున విఱ్ఱవీగుచుండును. ఆమెకాదినుండియు నిట్టి యభిప్రాయమే కలదు.

కృ—(తనలో) ఈనారదుఁడు కలహప్రియుఁడై రుక్మిణి మెప్పు బడయఁగోరి తన యిచ్చకపుమాటలచే సత్యభామ నధిక్షేపించుచున్నాఁడు. యీరమణికి యీపలుకు లాస్యాంతాజితితోఁ దెలుప

కుండునా? (ప్రకాశముగా) మునీంద్రా! మీరుచక్కగ విమర్శింపలేదు. ఆమె కింతగర్వ మున్నట్లు నాకుదోచదు.

నార—(కోపముతో) లేకేమి? ఆసత్రాజిత్పుత్రికపై గల పక్షపాతముచే నీవిట్లు వచించెదవుకాని యామె నెరిగినవా రందఱును నా పలికిన దంతయు యదార్థ మని శోధించకమానరు.

రుక్మి—అవును. ఆసుందరియందు గోవిందున కతిపక్షపాతము.

రమ—ఓకాంతా! అంతటి పక్షపాతమున్నచో పారిజాతం బానాతికేయొసగుగాని నీకేల యిచ్చును? ఆమె పరోక్షమున నిష్కారణముగ నామెను నిందింపనేల?

నార—ఓహో! చెలికత్తెవగుటచేతనా పూనికొనివచ్చితివి? ఏ భార్యయత్యధిక వినయవిధేయతాసౌభాగ్యసౌందర్యంబులలోనగ్రగణ్యురాలో యామె కాకుసుమమీ పురుషోత్తముడిచ్చెను. సత్యభామను నీ వెగాని నేనెఱుంగనా? తానుమహాపాత్రివ్రతనని ప్రాణనాధుని సయితము నిర్లక్ష్యము చేయును. ఈరుక్మిణీదేవి సద్గుణంబులు, తెలివి, వినయము, సౌజన్యము, గురుపూజ, పతిభక్తి, బంధుప్రేమము, దైవభక్తి, కృతజ్ఞత, యౌదార్యము మొదలగు సద్గుణమాణిక్య నికరంబు లామె సపత్నులకును నందు ముఖ్యముగ సత్యభామకు వేయింట తలక్రిందుగ దపమొనర్చిన నలవడునా? ఈమె యెక్కడ వారెక్కడ? సూర్యమండలమునకును మిణుగురు బురుగులకును గలభేదము గలదు.

రుక్మి—దేవరవా రతిశ్లాఘింపుచున్నారు.

కృ—మునీంద్రా! స్త్రీలప్రశంస యేటికి? చాలింతము.

నార—గుణాగుణ నిర్ణయము నిష్పక్షపాతచేతస్కుల మగు మముబోటి తపోధనులె చేయవలయు. ఆసత్యభామ యోర్వలేమికి దో డీరుక్మిణీదేవి కన్నియు లాభములె కలుగుచున్నవి. ఎవరెయసూయ నా

రినె చెరచును. తానెంతపరితపించినను దన కీమె మహిమము గోరంత యుగలుగదు. తా నెన్నివన్నెలు తెచ్చుకొన్నను జక్కదనంబున రుక్మిణికిం దీటురాదు. భర్తపయినెంత ప్రీతి వడసినను బట్టమహిషి యని తా ననిపించుకొననేరదు. ఆమె విషయమయి యింత వృథాప్రసంగ మేల యందువేని పత్నుల కిది కలహకారణ మనుమాట వచ్చెగాన మేమంతదూరము ప్రసంశింపవలసె ఓకళ్యాణీ!

రుక్మి—దేవా! ఆజ్ఞాపింపుడు.

నార—ఉ. నీసరిపత్ను లందరును నిన్నని నిత్యము నోర్వలేమిచే
గాసిలుచుండఁగా దొలుతకంటె మహావిభవంబులందుచు
న్వాసురసౌఖ్యముల్వడసి భర్తనుదైవముగాదలంపు మీ
యేసరి కైననోర్వనిమృగేక్షణలేచెడిపోదురుర్వరన్.

రుక్మి—దేవర యాశీర్వచన మప్రతిహతమగుం గాక!

కృ—అన్యథా యెన్నఁడునుగాదు. దేవఋషి పుంగవుఁడుగదా.

నార—దేవా! అధోక్షజా! ఇంక నేఁ బాతాళలోకంబున కరిగి యచ్చట నైచిత్ర్యంబులఁ గని మరలివచ్చెదను. నాకనుజ్ఞయొసంగుము.

కృ—(లేచి) దేవా! చిత్తము. అనుగ్రహముంచుఁడు.

నార—(తనలో) వచ్చినకార్య మైనది. కలహవృక్షమునకు విత్తనము నాటితిని. అచిరకాలమున వీరు దానిఫల మనుభవింతురు గాక! [అని నిష్క్రమించును.]

రమణిక—దేవా! నేనును సెలవుఁ గైకొనిమెదను.

కృ—రమణికా! నీవు కోసినసంపంగిపువ్వుల నిచ్చుటమఱచితివి. [వాని, బుచ్చుకొని రమణికను డగ్గఱి రహస్యముగ] ఆ నారదమౌని కలహసూచిక వాక్యంబులును పారిజాతంబు రుక్మిణి కొసఁగుటయు నీ

వా సత్యభామకు నెఱింగింపక యిచ్చుటనే మఱచిపోమ్మ. కానిచో మి గుల మోసంబు వాటిల్లును.

రమ—స్వామీ! భార్య నన్యు(డు పరిభవింపుచుండెనుగదయని యభిమానమైన లేక యూరకుండి యిప్పుడామాటో( జెప్పవలదననేల? సత్యభామ కోపించిననేమి? రుక్మిణి యనుగ్రహమున్న(జాలదా? ఆమె కీపుష్పములుమాత్ర మెందుకు?

కృ—[తనలో] అయ్యో! ఈనారదు( డెందుల కరిగిన సంను గలహోదయమేకదా! నే నిప్పుడు నిశ్చయముగా సత్యభామయెడ నప రాధి నయితిని [రుక్మిణియొద్దకు వచ్చుచున్నాడు.]

రుక్మి—[తనలో] ప్రాణేశ్వరు(డు రమణికను సాగనంపునెపము న వినయపూర్వక మగు సందేశ మంప బోలును.

కృ—[తనలో]

చ. తెలుపకపోదు నారదుని తీవ్రపుబల్కులు చేటి సత్యతో
గలమున దండతాడితభుజంగివిధంబున నాలతాంగి బి
ట్టలుగకపోదు నాయవినయంబునకు న్మనితూలుమాటకు
న్గలుగకపోదు ప్రేయసికి నాకును నెయ్యపుగయ్య మిమ్యెడన్
దేవీ! మందిరమున కరుగుదము రమ్ము.

[ఇద్దరు నిష్క్రమించుచున్నారు.]



శ్రీ

# పారిజాతాపహరణము



## ద్వితీయాంకము.

---

ప్రదేశము—సత్యభామా మందిరము.

(సత్యభామయు, భ్రమరికయుఁ బ్రవేశించుచున్నారు.)

సత్యా—ఓసీ! భ్రమరికా! రమణిక యింతవడవు రాకుండుటకుఁ గారణ మేమని నీ వూహించెదవు?

భ్రమ—దేవీ! మన రమణికను మీరు భర్తయొద్దకుఁ బంపిన యొక్క ముహూర్తమునకే మహానుభావుఁడగు నారదమునీంద్రుఁ డాయనను సందర్శింప రుక్మిణీ మందిరంబున కరిగెనని కింకరుఁ డొకఁడు నాతోఁ జెప్పెను. ప్రభావముచేత మాత్రమే యిదివఱ కెఱుఁగఁబడిన యాదేవర్షిని విలోకింపుచుఁ జమత్కారగర్భంబులగు నతని పల్కుల నాలకింపుచు మన రమణిక యచ్చోటు విడిచి రా మనసురాక యిట్లు మసలెనని నాకుఁ దోఁచుచున్నయది.

సత్యా—అయ్యో! కలహమె పురుషార్థముగఁ దలఁపోయు నాజడదారి భర్తగారిని దర్శింపవచ్చెనని వినుటతోడనే నామనస్సు పరిపరివిధంబుల శంకింపుచున్నది. భర్త రుక్మిణీమందిరంబున నుండుటయుఁ గలహభోజనుం డానెలవునకుఁ బోవుటయు మారమణిక జాగుసేయుటయుఁ జక్కఁగ విమర్శించిచూడ నాకు భయమగుచున్నయది.

భ్రమ—అమ్మా! నీవింత శంకింపవలసిన పనిలేదు. శిష్టజనపరిపాలకుఁ డగు దేవకీనందనునిఁ గనుఁగొనఁ బలువురు వచ్చుచుందురు, పోవుచుందురు. అట్టిచో నారదుని రాకకై నీకింత భయమేల కలుగవలెను? అది యటుండ మీ దంపతుల యన్యోన్యానురాగము సందేహమగు విషయము కాదు.

సత్య—అట్లయినఁ బ్రాణేశ్వరుఁడు నాసందేశము సబహుమాన ముగ నాలకించి నాకు దర్శన మిచ్చి నన్ను సన్మానించుననియే నీవు తలంచెదవా?

భ్రమ—నిశ్చయముగా నట్లే తలంచెదను. ఎప్పటికప్పుడే మరచె దవుగాని నీవు మాత్రి మామాట యెరుఁగవా? వాసుదేవుఁ డేయిందు వదనమందిరమున నున్నను నేముద్దియతో ముచ్చటలాడుచున్నను బంచ ప్రాణములు నీమీఁదనే నిలిపి శరీరము మాత్రము వారి కప్పగించి మనసున నిన్నే స్మరించుచుండును.

సత్య—అట్లయిన నీయుపచారవాక్యములచే నామనం బిప్పుడించుక యూరడిల్లుచున్నది. సత్యాభామావిధేయుఁడని ప్రాణేశ్వరునకు గలిగిన బిరుదము సార్థక మగుఁగాక!

భ్రమ—అదిగో మనరమణిక వచ్చుచున్నది.

సత్య—(ఆత్రముతో) ఏది? ఏది?

(అప్పుడు రమణిక ప్రవేశించుచున్నది.)

రమ—(తనలో) అయ్యో! దేవితో నేనప్రియము విన్నవింపవల సినదాన నైతిని గదా! సత్యభామ వాసుదేవ సముఖమునకు న న్నేటి కనిపె? పోయినదానను సందేశ మెరిగించినతోడనే రాక యచ్చట నేల మసలితిని? ఇప్పుడది నేను తెలుపకున్నను గగ్గాకన్న ని ఈమె వినక పోదు. వినినప్పుడు మున్నేటి కెరిగింపక పోయితివని నన్నీమె దండించును. తెలిసి నచో వాసుదేవునకు నాపయి నలుకపొడమును సేవకావృత్తి కేవల దుఃఖ భాజనముగదా (మెల్లగా సత్యాభామను సమీపించును.)

భ్రమ—రమణికా! మెట్టబడిన తాబేటివలె నంతమెల్లమెల్లగ నడచుచున్నా వేమి?

సత్య—దీని మందగమనమే నామనసున కాందోళనము గలిగించు చున్నది. అయిన నేమి చెప్పునో చూతము.

భ్రమ—ఓసీ! పలుక వేమె? మాధవునివార్త కాయా? పండా?

రమ—ఏది యనుకొన్నచో నదియే.

సత్య—హృదయేశ్వరుఁడు నాసందేశము నాలకించెనా?

రమ—చెవు లుండగ నాలకింపకపోవుట యెట్లు తటస్థించును?

సత్య—వినుట యనగ నానందముతో నత్తునని చెప్పెనా?

రమ—మాటమాత్రము చెప్పెను.

సత్య—అట్లయిన రాఁడా యేమి?

రమ—ఏమొ ఆవిషయము నే నే మెరుఁగను.

సత్య—నీ సందిగ్ధ వచనములచే నా హృదయంబు పరితపించుచున్నది. అదియునుగాక నీముఖ మేమొ కాని దైన్యసూచకముగ నున్నది. కాన నీకో నాకో మహాపరాభవము సంప్రాప్తమగునట్లు తోఁచుచున్నది.

రమ—నాకయినచో బ్రతికియే పోవుదును.

సత్య—అట్లయిన నభిమానధాముమగు నీసత్యభామకే యనరాని పరాభవము తటస్థించినదా? యాగ్రమహిషి ననుగర్వితయని రుక్మిణి నన్నేమయిన దూలనాడెనా? తోలుపలుగు నాసమ సఖులు నన్నుఁ నిందించిరా? కాక మిత్రవింద, జాంబవతి లోనగు సవతులు దూషించిరా? వీరలుగాక నన్యులు నన్నుఁ దలపెట్టిరు.

రమ—అయ్యో! నిష్కారణముగ నందఱు నిందింప నేలనమ్మా! ప్రాణవల్లభుఁడు తిరస్కారభావముఁ జూపిన నొరుల ననునేల?

సత్య—[ఆత్రముతో] ఏమీ! ప్రాణేశ్వరుఁడే తిరస్కారముఁ జూపెనా?

రమ—అట్లనర్చుటకు మఱి యెవరు సాహసింతురు?

సత్య—రమణికా! నీచమత్కారవచనంబులఁ జాలించి యతిత్వరితముగ భర్తకడఁ బ్రవర్తిల్లిన సమాచార మామూలాగ్రముగ నెఱింగింపుము.

రమ—ఎఱిగించుట కేమున్నది? వినుము. నే నఱిగిన దొుకే ముహూర్తమునకుఁ గలహాశనుఁడగు నారదుఁ డుంపుల కిరుడెంచెను.

భ్రమ—దేవి యదియంతయు నిదివరకే వినియున్నది. తరువాతి వృత్తాంత మెఱిఁగింపుము.

సత్య—కలహకల్పనావిశారదుఁ డగు నారదుఁడు నావిషయమై యేమయినఁ బ్రస్తావించి రుక్మిణిని వినుతించెనా?

రమ—ప్రస్తావించుటమాట యటుండనిమ్ము. అతఁ డాదేవేంద్రో ద్యానవనంబున నుండి జగద్విఖ్యాత మగు పారిజాత పుష్పము తెచ్చి గోవిందున కొసఁగెను.

సత్య—[సంభ్రమముతో] అట్లయిన భర్తగా రాకుసుమలలామ మును నాకుఁ బారితోషికముగ నిమ్మని నీచేతికిచ్చెనా? ఏదీపుష్పము?

రమ—ఇంకను నీవు తప్పుత్రోవనె యుంటివి. నిజప్రాణసమాను రాలగు రుక్మిణి దగ్గఱనుండఁగ నతఁ డది నీకేల యొసగ బంపును? ఎంత పిచ్చిదానవమ్మా?

సత్య—[నివ్వెరపడి] ఏమి రుక్మిణికే యిచ్చెనా? నాకు బంపలేదు. ఆకపటజగన్నాటక సూత్రధారుఁడగు కృష్ణుఁడెంతలో రుక్మిణి మాయఁ దగిలెను? కానిమ్ము. తదనంతర మేమిజరిగినది? దాచక వేగ మెరిగింపుము.

రమ—తదనంతర మానారదుఁడు రుక్మిణి గుణగణంబులు బ్ర వలెఁ బొగడుచు నీపతిదుర్గుణసమేత వనియు బలిభ శౌర్యవనియు నిర్భయముగ వచించెను.

సత్య—[మిక్కిలి కోపముతో] ఏమేమి? కలహప్రియుఁడగు నారదుఁడు పారిజాతపుష్పంబు పారితోషికంబుగ నా వాసుదేవున కొసఁగును వచ్చును. అతఁ డాత్మీయప్రాణసమానురాలగు రుక్మిణి కది యర్పించను వచ్చునుఁగాని నిష్కారణముగ నా సవతియెదుట నాపరిచార మతఁ డేల యెత్తవలెను? అన్నన్నా! ఆసమయంబున రుక్మిణి మహానంద ముతో నాలకించుచుండెను గాఁబోలును! అవునటే?

రమ— నేత్రాపులు వెదజల్లుచున్న యా పుష్పమును రుక్మిణి ధరించి శచీదేవిని మించిన విలాసముతో నుండెను.

సత్య—[అసూయతో] ఆయసహ్యమగు వర్ణనమేల? సంగతి చెప్పక.

రమ—అట్లయిన వినఁదగిన వన్నియు వినిపించెదను. సావధానవు గమ్ము. భర్త స్వయముగఁ దనచేతులతో నాపుష్పమునుఁ దన కొప్పున ముడువ రుక్మిణి యానందముతో మునిపలుకు లాలించుచుండెను.

సత్యా— (కోపముతో) హా! రుక్మిణీ! ఒక పారిజాతపుష్పంబు ధరించినందుకే యింత గర్వించవలెనా? కాని రమణికా! భర్త యప్పుడేమి చేసెను? నారదుని మందలించి నాపక్షము పల్కెనా?

రమ—అట్లుచేసిన లెస్సగనే యుండును. తా నేమియు నెరుఁగని యున్మూనివలె మునిమాటలకుఁ జెవు లప్పగించి యూరకుండెను.

సత్యా—(కన్నీటితో) పరనిందాపరాయణుఁడగు నాజడదారి నన్ను అట్లవమానింపుచుండ హృదయేశ్వరుఁడు తనకుఁ గానట్లూరకుండెనుగా? అయ్యో! పురుషులెంత చంచల స్వభావులే! రమణికా!

రమ—నీవిప్పుడు మేలుకొంటివా? నాకు మాత్రమిది క్రొత్త కాదు.

సత్యా—మానవతికి భర్తయే యేడుగడ! అట్టియతఁడె నిర్హేతుకముగ నిరాకరింప జీవితము నిష్ఫలము.

రమ—అంతటిమాట యెందుకమ్మా!

భ్రమ—దేవీ! అమంగళము నోట రానియ్యకుము.

సత్యా— ఏపారపాచ్చెము లెన్నఁ డెరుగని యభిమానవతి కింత కన్న నెక్కుడు క్రోధహేతువు లేముండును? పురుషుఁడు తన కులకాంత నెంతకాలము గారవించునో యంతకాలము లోకజనంబు లాలోలలోచనను సన్మానింతురు. పతియే నిర్లక్ష్యము చేసిన గౌరవింతురా?

రమ—అవును. గౌరవింపనిమాట సత్యమే కాని

సత్యా—(నిట్టూర్పు) గౌరవము చెల్లినంతఁ దనుక మానవతి జీవింపనగుఁగాని నగుఁబాటునకు లోనయినబ్రతుకు బ్రతుకనేల? మానము కంటెఁ బ్రాణ మెక్కుడిది కాకున్నను నీప్రాణముల పై నీతుచ్ఛ శరీరమున కెంత యభిమానమున్నదే?

రమ—అదేమి మాటమ్మా! బ్రతికియున్నవారికే సుఖదుఃఖానుభవము. మరియొకలా గగుట యెవరిని సాధింపను?

సత్యా—(నిట్టూర్పువుచ్చి) అక్కటా! ఆరుక్మిణి కింకరుని కపట వ్యాపార నైపుణిని మెచ్చవచ్చును. నాదగ్గఱనున్నపుడు తన యనురాగరసము పొంగి పొరలివచ్చునట్లు దేనియ లుట్టిపడినట్లు పలికి వీనుల విం

దొనర్చి ప్రేమ యభినయించి నన్నుం బెడత్రోవ నుంచుటలో నతఁ డెంత నేర్పుఁ బ్రకటించెనే?

రమ—ఆమహానుభావుని ననవేల? మొదటినుండియు నాయన వర్తన మెఱుఁగని లోపము మనదే.

సత్యా— నిరంతరంబును మనోభీష్టదాయకుఁ డయి మనసిచ్చి పలుకు ప్రాణనాథుఁ డెంత ధన్యలకు లభించును? భర్త భార్యకు ధనమిచ్చి పుచ్చుకొన్నను మనోవిచార ముండదు. కాని చనువిచ్చి పుచ్చుకొన్న దుస్సహముగ నుండును.

భ్రమ—ఈవఱ కెన్నఁడైన నాయన యట్లు చేసెనా? అదియొక వేళావిశేషము.

సత్యా—అవును. పరిహాసార్థమయినను నాపుండరీకాక్షుఁడు నా గీచినగీటు దాఁటి యెఱుఁగఁడు. ఎందఱెందరు రాజాధిరాజు లెంతెంతలు వెలలేని కానుకలు తెచ్చి కంపినను నాకె యొసఁగెడువాఁడు! నాయనుమతి గొనక నాసపత్నుల యంతిపురముల కైనను బోయెడువాఁడు కాఁడు. ఒకవేళ బ్రమాదవశమున నాకిష్టముకాని దేదయిన నొనర్చినను నా కెఱుఁగ జేయువలదని నాసఖీజనంబుల కించుకించుక లంచంబులుగూడ నిచ్చుచుం డెడివాఁడు. అట్టి లావివాహ ప్రపర్థమాన ప్రేమమును నేఁడీ పారిజాత పుష్పము కతమున నతఁడు మరచెఁగదే!

(కన్నీరు నించుచున్నది.)

రమ—దానికిఁ గారణము నారదుఁడును గాఁడు పుష్పముగాదు. రుక్మిణీసమక్షమే. స్వామివారికి యెదుటనున్నదె పెండ్లికూతురు గదా!

సత్యా—రమణికా! చక్కఁగఁ జెప్పితివి. నాభుజలతను హృదయేశ్వరు బాహుస్తంభములకుఁ బెనువేసి కృత్రిమపర్వతాధిరోహణ మొనర్చు నాఁటి యానందంబును, సకల కుసుమాభిధామారామవిహార మొనర్చు నాఁటి సంతోషంబును, శుకపికశారికాచక్రవాక మిథునంబుల విరహవేదనా దర్శన మొనర్చునాఁటి సౌఖ్యమును, మరాళతూలికా శయ్యాతలంబునఁ గల దృఢాలింగన సుఖంబును నావగలాఁడియగు రుక్మిణి మాయం దగిలి మదనజనకుఁడు మఱచెను. అయ్యో! ఏమి యొనర్తును? పదునారువేల

సవతులలో నగుఁబాటొందుమని నాతల వ్రాతయుండ నొకరి ననసేల? హా! తండ్రీ! సత్రాజిత్తా! ఇందరు సవతులలో నేనుఁ గాపుర మొప్పుగ జేయుదుననియె నన్ని గుహనాగోపాలున కిచ్చి వివాహ మొనర్చితివా? నీవా శ్రీకృష్ణస్నేహ లోభంబున నాగొంతుఁ గోసితివి. (కన్నీరు విడుచుచున్నది.)

రమ— దేవీ! నేత్రద్వంద్వమునందు ముత్యములలీలం గారు బాష్పములఁ బుడిచికొని యించుక యూరడిల్లుము.

భ్రమ— అమ్మా! భార్యాభర్తల కొక్కసమయంబునఁ బ్రణయ కలహము సంభవించును. దాని కింత వంత నొందనేల? (సత్యభామ కన్నీరు తుడుచుచున్నది.)

సత్య— అయ్యో! యీవర కపూర్వగర్వము గాంచి రూపలావణ్యంబుల జగత్ప్రసిద్ధి కెక్కినట్టి నన్ను నాసవతి యెట్టయెదుట నొకఁడవమానింపఁ దా నొక మూఁగవానివలె నాలకించుచుఁ బ్రాణనాథుఁడుదాసీనుఁడయి యుండ నే నూరడిల్లుట యెట్లు? నాహృదయశల్యముఁ బెరుక నెవరితరము?

రమ— అమ్మా! ఇంత విచారభారము నొంది చేయునదేమి? శాంతించి కార్యసాధన మొనర్చుకొనుట యుక్తము.

సత్య— ఇంక దేహత్యాగముకంటె నన్యసాధనము లేదు. ఈ యలంకారములు నీ చీనిచీనాంబరములు, నీకుసుమదామములు నాకేల? ఆకామినీ పంచశరుండు మత్సదనమున కరుదెంచి నన్ను సంభావించునని యెంచి యింత యలంకరించుకొంటిని. నాకును నాభాగ్యమునకును నారద ముని కతమునఁ బారిజాతసుమముతో ఋణము తీరినది. శరీరము పైఁగల వృథాభిమానమున మరియొక పనికి సాహసింప జాలకుండుటచే నే నీ ముహూర్త మారంభముగ నాహారవిహారాదుల విసర్జించి దేహము శుష్కింపఁజేసి నందనందనునకుఁ గన్నులపండువు చేసెదను. అహాహా! దైవ మెంతకాలములో నాచర్యల నెంతవఱకుఁ దెచ్చెను? (ఏడ్చుచు) హా! ప్రాణనాయకా! నన్నఖిల నారీమండలమున నింత పరిభవించుట నీ కేమి యొగ్గుచేసితిని? హా! ఇంక నతనికి నే నెక్కడి భార్యను? నన్నా

మహాత్మ్ముడు దాసిగా నెంచెను. అతఁడు నన్నుఁ దన భార్యనుగా నాలో చించినచో నిట్లేల యొనర్చును? ఇంక నే నీ శృంగారభవనంబున నిల్చు టెందుకు? నాకోపగృహంబున కరిగెదను. ఓసీ! రమణికా! నీవు ద్వార ముకడనుండి యామాయగోపాల కృష్ణుని రానియ్యకుము. (దుఃఖించుచు పోవుచున్నది.)

రమ—అయ్యో! సత్యభామ మహాక్రోధోద్దీపితురాలై చనుచు న్నది. ఆనారదుఁ డేల రావలె? వచ్చిననేమి పారిజాతంబు కృష్ణున కేల యియ్యవలె? ఇచ్చెనో కృష్ణుఁడు దాని సత్యభామ కేటి కంపడయ్యె? పోనిమ్మది యట్లుండనిమ్ము. అంత కలహావినోదుఁడై నారదుఁడు సత్య భామను దూలనాడ కృష్ణుఁడాతని నేల మందలింపడయ్యె? ఇంతకు దైవ ప్రయోగ మీక్రమంబుననుండ నన్యథా జరుగుటెట్లు తటస్థించును? ఈ సత్యభామ నిజకాంచనచేలంబులు విడిచి మాసిన చీరగట్టి సమస్త భూష ణంబుల దీసివైచి వెలుగులేని యాచీకటింట మూర్తీభవించిన శోకము వలె పవ్వళించి నాను నెరపు గొలుపుచున్నది. అయ్యయో! ఎంతదుర్దశ గలిగెను? ఈసతాన్రిజితి మిక్కిలి పంతముగలది. ఎన్ని చెప్పినను వినదు. అయినను సంకోకపర్యాయము బ్రతిమాలి చూచెదగాక! ఓసీ! భ్రమ రికా! నేను దేవి ననుసరించి యుండెదను. గృహకృత్యంబులు నీవు నెర వేర్చుచుండుము.

భ్రమ—అట్లే చేసెదను.

రమ—(నిష్క్రమించును.)

భ్రమ—(తనలో) పండువంటి సంసారము క్షణములో చెడినది. ఏవేళ కేది యెట్లగునో తెలియదుగదా! (నిష్క్రమించును.)

రెండవరంగము—సత్యభామాకోపగృహము.

(నగలుతీసి మాసినచీరగట్టి మంచముపై బవళించి సత్యభామయు నామె కు సురటివేయుచు రమణికయు ప్రవేశించుచున్నారు.)

సత్య—ఓసీ రమణికా! మగవారికూరుము లెట్టిచంచల స్వభావ ములో చూచితివిగదా. భర్తచేసిన వినయచేష్టితములకు నే నిప్పుడింత బిట్టలుక బూనియున్నదాననుగాని యామన్మథ మన్మథుని ముఖారవింద

దర్శనము చేయుటతోడనే నా కీ బింకము నిలుచునా? నిలువదా? యని సందేహించుచున్నాను. అయ్యో! ఎంతవెఱ్ఱిదానను? ఈమందభాగ్యురాలికి మరల జీవితేశ్వరుదర్శనం బగుటఁగూడ లభించునా? సకలజలధరశ్యామమై యువతీజనమనోహరమై వెలయుభర్తృగాత్రము పొందియు నాకన్నులపండు వెన్నఁడైన నొనర్చునే? ఇదివట్టియాస. నాభాగ్యమంతయు నాసవతుల పాలయినది. ఓసీ! రమణికా! నాకాయాస మధికమయి మేనెల్లఁ జెమ్మట గ్రమ్ముచున్నది కావున వింజామరతో నించుక విసరుము.

రమ—ఇదిగో నట్లేచేయుచున్నాను. (అని విసరుచున్నది.)

సత్య—అయ్యో! ఈవ్యజనమునుండి వచ్చువాయువులు నామేనికిఁ వేఁడిగసోఁకుచున్నయవి. ఇంచుక చన్నిజలము దానిపైఁజల్లివిసరవే.

రమ—నీ కెట్లు సుఖముగయుండునో యట్లు చేసెదను.

(నీళ్లుచల్లి విసరుచున్నది.)

సత్య—హాయి! హాయి! ఇప్పుడించుక కన్నులు మూఁతలుపడుచున్నవి. చెలీ! నీవిట్లెవిసరుచుండుము. (అని యొక్కనిమిషము నిద్రించి యాకస్మికముగ మేలుకొనిలేచికూర్చుండి) ఓయి! ధూర్తగోపాలక! ఇది రుక్మిణిమందిరమనుకొని పొరపాటున నిందువచ్చితివా? (అని చూచి తెల్లఁబోయి) ఓసీ రమణికా! ప్రాణవల్లభుఁ డిప్పుడిటకురాలేదా?

రమ—అమ్మా! కలగంటివేమొకానియాయనయిందు రాలేదు.

సత్య—అయ్యయ్యో! నాభేలతనమును జూచినీవు నవ్వుకొనుచున్నావు కాఁబోలును. సీ! అందరకును హాస్యాస్పదమగు నీజీవముతోఁ బనియేమి? రమణికా! ఆపూతోఁటకుఁ బోయి మాధవీలత నొకదానినిఁ దెమ్ము. దానిని గంఠాభరణముగ బిగించుకొని నాసవతులకందరకు నానందము గలిగించెదను.

రమ—(చెవులుమూసికొని) అమంగళము ప్రతిహతమగుఁగాక! దేవీ? ఏల యిట్లనుచితములైన మాటలు రానిచ్చెదవు?

సత్య—(ఆమాటలు వినిపించుకొనక) అయ్యో! పరిచారికలు కూడ నాయాన నలక్ష్యము చేయుచున్నారు. ప్రాణనాథునివలన పరి

భవము నొందిన కాంత పరిజనమునకును బరిహాసపాత్రమై యుండదుగదా ఓయదుకుంజరా! నీకిల్లాలయినందుకు నాయుల్లంబు పల్లవింపఁజేయుటకు మారుగఁ దల్లడింపఁజేయుటకు నీకుఁజెల్లునా? నాసముక్షము నొక్కక్షణమును బాయక నన్నానందవార్ధిని దేలుచుండు నీవు నేఁడక్షీణదుఃఖసాగరమున ముంచుట నీకుఁ బాడియే! ఆరుక్మిణీకాంత నంత గౌరవించుటకును నన్నిట్లు తిరస్కరించుటకును నామె యొనర్చిన లగ్గేమి? నేనొనర్చినయెగ్గేమి. నాజన్మాంతరపుణ్యం బిట్లుండ మిమ్మననేల!

(అని కన్నులు మూయుచు నిద్రించుచున్నది.)

రమ — ఈమెకు నిదురపట్టినది. ఈనిద్రయందయిన నీమెదుఃఖము మరువవచ్చును. అంతలో వాసుదేవుఁడరుదెంచి, బుజ్జగించి, యలుకఁదీర్చి యీమెను బ్రసన్నురాలినిఁ జేయగలఁడు. భార్యలపాలయల్కలుఁ దీర్చుటలో నామాహాత్మ్యునికి గల నేర్పెవ్వరికిఁ గలుగును?

(అప్పుడు కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కృష్ణు — (తనలో) ఈవిషయమున సత్రాజిన్నందనకుఁ గోపకారణము లేక పోలేదు. ఏలయన.

తే. గీ. రుక్మిణీసత్యభామ లిర్వురకు నేను
బంచితిని గూర్మి తులఁదూచు భంగి గాక
నిపుడు వైదర్భివంక పువ్వొత్తుకూర్మి
యతిశయంబుగఁ గన్పడు నామెమదికి.

అదియునుగాక సాత్రాజితి మహాప్రౌఢయు ధూర్తయు గావున నీస్వల్పవిషయంబునకే మనస్తాపము నొందును.

రమ — (తనలో) ఎవ్వరో వచ్చుచున్నారు. (చూచి) అదిగో! కొంకు జంకులేని గోవిందుఁడే.

కృ — (నలుదెసలఁ జూచి తనలో) ఏమిది? నాకనుల కంతయుఁ గ్రొత్తగ నగపడుచున్నదే.

సీ. కనుపండు వొనరించు కనకసౌధ మిదేమి?
చిన్నెల నెడఁబాసి చిన్నవోయె

విజయస్వయదుచంద్రి విజయస్వ యనుచు న
న్పలుకరింపద దేమి చిలుకపిండు?
నిస్తరంగంబైన నీరాకరముఁబోలె
మందిరం బిది యేమి మూఁగు మణిఁగె?
నళినలోచనతోడ నారాఁక లెటికెఁగింపఁ
బరుగువారు రి దేమి పరిజనంబు?
ఆవనంబులఁ జిఱునగ వంకురింప
నెసరు రా రదియేమి నా కింకుముఖులు?
కానఁబడ దేమి కన్నుల కఱవుదీఱఁ
జక్కదనముల సీమ మాసత్యభామ!

రమ—(నవ్వుచు దనలో) ఇతర వ్యాపారవిషయంబుల నెట్లు న్నను స్త్రీల విషయంబునఁ బురుషులు మిక్కిలిఁ జులుకనయిన మనసు గలవారు. ఇప్పు డీయనభార్యను బ్రతిమాలుట కామెను వెదకికొనుచు నెట్లు వచ్చుచున్నవాఁడో!

కృ—(సత్యభామను సమీపించి రమణికతో) దేవికి నిమురవ్వి నదా! అట్లయిన నీచేతి వింజామర నాకిమ్ము. నా యపరాధము నాయు పచారముతోఁ దీఱును.

రమ—ఎదుట నుపచారము వెనుకఁదిరిగిన నపచారము సలుపుట దేవరకే చెల్లినది. ఇదిగో వింజామరం గైకొనుఁడు. (ఇచ్చుచున్నది.)

కృ—(పుచ్చుకొని విసరుచుఁ దనలో) నే నుపచారము చేయు చున్నానుగాని

క. ఈవెలఁదుక కోపానల
మీవీవన విసర మంట లెగసెడునో? క్రో
పావేశము దీపకళిక
కైవడి వడి నాఱిబోయి కడునుట్టెడునో?

సత్య—(మేలుకొని) అధికముగ నిద్రాసుఖము గలిగినది. (స్ప ర్శము నభినయించి) అహాహా! ఇంకను నెంతయు జాగ్రత్తతో విసరుచు నే యుంటివఁటే? ఎంతచల్లగాలి తగులుచున్నదే. కాని యీమందవా

యువులతో భూలోకదుర్లభసుగంధంబు వచ్చుచున్నది. రమణీకా! ఈ కమ్మతావు లెచ్చటివే? (అనికృష్ణునిజూచి మరల ముసుఁగు పెట్టుకొనుచున్నది.)

కృ—ఓశరత్కాలసంపూర్ణచంద్రాననా! నావదన సందర్శనము చేసి వెంటనె ముసుఁగిడనేల? ఓకళ్యాణీ! పూర్వమువలెనె

చ. మెఱుఁగు బసిండియందియలు మేలిఝుళంఝుళనాద మీనఁ జె
చ్చెర నెదురేగుదెంచి యిరుచేతులఁ గౌఁగిట జేర్పవేమి? యా
చెఱఁగనఁ వొక్క ముద్దొలుకు స్వేదకణంబులు మేననుండి నీ
చెఱఁగున నేర్పుతోఁ దుడిచి చేయ వదేటికి నాకు మన్ననల్.

ఓగంధసింధురరాజగమనా! కృపారసశీతలము లగు నీ యపాంగావలోకనంబులకమె యెదురు చూచుచున్న నన్నన్యథాబుద్ధిఁ దలంపఁజెల్లునే! నేను పరుఁడను గాను. చూడు.

ఆ. వె. ఇంచు కేని నీకు నెగ్గు సల్పనివాఁడఁ
దలఁపునందు నిన్నె నిలుపువాఁడ
నీయనుగ్రహంబె నెఱనమ్ముకొనువాఁడ
నేలుకొనుము నీకు మేలువాఁడ.

ఓకళ్యాణీ! ఈవఱదనుక నీమాట జవదాఁటి యెఱుఁగను. ఇప్పుడుదాఁటుచున్నవాఁడఁగాను. ఇఁక నెన్నఁడు దాఁటఁబోవను. గీచినగీటు దాఁటక నీకనుసన్నల మెలఁగు నీపరిచారకునిపై నీకేఁ గోపంబుమానఁజెల్లు.

సత్య—(తనలో) ఇంతట మాను కోపముగాదు. [ముసుఁగు బిగఁదీయుచున్నది.]

కృ—ఓమృగరాజమధ్య! రాకేందుబింబమును దెల్లమబ్బు గప్పినచందంబున లావణ్యపుంజ మగునీవదనాంబుజంబును వెల్లముసుఁగున నేల గప్పెదవు? నీవిలాసంబునకు, నీహాయలునకు, నీచాకచక్యమునకు, నీ నైదుష్యమునకు, నీయుక్తికి యొప్పవే? కళ్యాణనిలయ మగు నీ మందిరంబును, నీయలంకారములను నింత చిన్నచూపు చూడఁదగునే?

సీ. సిగబంతి నీ కేమి పగయొనర్చెన దిష్ట
ధరియింపకుండ త్రో తలిరుఁబోఁడి!

హరిచందనం బేమి యపిప్రియం బొనరించె
మైఁబూయకుంట కోమధురవాణి?
పన్నీరుసల్పిన పాపకర్మమదేమి
జలకంబుమాననో జలజనేత్రి?
జలుఁగుదువ్వలువలు చేసినయెగ్గేమి
కట్టకుంటకు నేఁడు కలికిమిన్న?
తప్పుగలవారి దండించు టొప్పుఁగాని
యనపరాధుల శిక్షించు టర్హమగునె?
నిఖిలధర్మంబు నెఱిఁగిన నిన్నుఁబోలు
రాచబిడ్డకు సింధురరాజయాన!
దేవీ! నాతోడ దాఁగిలిమూతలాడక లెమ్ము. [ముసుఁగుదీయును.]
సత్య—(చెయ్యి తీసి వేసి) నాపరిచారము మీకేల?
కృష్ణు—(చిఱునవ్వు నవ్వుచు సత్యభామగడ్డము పట్టుకొని)
తే. గీ. ఇంతమాత్రింపుఁబనికి నీకింతయలుకఁ
గలుగఁజెల్లునె నామీఁదఁ గమలనేత్రి!
మగువలకు నల్క పాడమదా మగలమీఁద?
నిట్టిబింకంబు లుండునే యెచటనైన?
సత్య—(మొగము త్రిప్పుచున్నది.)
కృ—ఓమనస్విని!
సీ. ఈమేని పరితాప మేమిటఁ జల్లారు
బిగియారుఁగౌఁగిటఁ బెనుప వేని
యీమనోభవదాహ మేమిట శమియించుఁ
సొబగువాతెఱరుచు ల్జూపవేని
యీమనస్సంతాప మేమిట నశియించుఁ
జిఱునవ్వువెన్నెల ల్జిమ్మవేని
యీ వీనుఁగవతుప్పు లేమిటి విడిపోవు
నలరుఁదేనియ లొల్కఁ బలుకవేని

గీ. యింతి నామీఁదఁ బ్రాణంబు లెల్ల నిలుచు
వాలుచూడ్కులు నామీఁదఁ బరపవేని
యలుక మానఁగదవె మాటలాడఁగదవె
కరుణఁ జూపఁగదవె నన్నుఁ గావఁగదవె.

సత్య——(కోపముతో) ఓకపటగోపాలకా! నీ హృదయంబు తెఱంగు మఱుంగు లేక యెఱుంగుదును. అవసరము గలిగి మెఱమెచ్చులయనురాగముఁ జూపుచున్న నీ వ[illegible] యెఱుంగరు! ఆరుక్మిణి సదనంబునకే యరుగుము. నేను నీకు భార్యనగుదునా? అన్నన్నా! ఎంత మాట! కొంచెమైన సిగ్గులేక మరల నాసదనంబునకేల వచ్చితివి? నీవు దగ్గఱనుండి రుక్మిణియానందించునట్లు నారదునిచే నన్నవమానింపఁ జేసితివా?

కృ——[illegible] [illegible] దం[illegible] సపత్నీక్షేపించఁబడితిని గనుక తద్వృత్తాంతము నన్నడిగి యెఱుంగుము.

సత్య——నిన్నడుగనేల? తెలియుటచేతనె యిట్లంటిని. నాసఖి గఱ నిందించినచో నాయెదుర నిందించినట్లు గాదా? అగ్నిసాక్షిగఁ జేపట్టినభర్తకభిమానము లేకపోయినను నాచెలికత్తె యయిన నాకైన నింత దనుక నభిమానమున్నది. రమణికి నాతోఁ జెప్పదనుకొంటివా?

కృ——అట్లేల యనుకొందును? దానికి నీపై గల యభిమానము నెఱుఁగనా?

సత్య——ఎట్లనుకొన్న నేమి? కలహ వినోదియగు నారదుఁడు నన్ను నిందింప వీనులవిందుగా వినుచుంటివికాఁబోలును. నన్నధిక్షేపించుట నిన్నధిక్షేపించుటకాదా? భార్యను భరించు పురుషుఁడు భర్త. ఇదియేనా నీభరించుట? ఇదియేనా నీభర్తృత్వము? సతిపతు లన్యోన్యగౌరవములతోఁ దమకుఁ జూడవలదా? సతి యన్యజనదూషిత యగుచోఁ బతియు, బతి యన్యజననిందితుఁ డగుచో సతియు, నానందించుటయా యుత్తమస్త్రీపురుషలక్షణంబులు? నామీఁద నీకింత యనురాగము నింతయభిమానము నింత గౌరవము కలదని నేఁ డెఱింగితిని.

కృ—దేవీ! [illegible] ఉన్నది [illegible] పాడిగాను.

సీ. [illegible]! [illegible]

[illegible] నన్ను జూడరాదె?

తరుణి! నీమీఁద నేను తప్పుఁజేసితి నేని

పువ్వుబంతుల నన్ను రువ్వరాదె?

వనజాక్షి! నీమాట జవదాఁటితినయేని

కలువతూఁడుల నన్నుఁ గట్టరాదె?

మగువ! నీపనుకేను మఱచిపోయితి నేని

విరిదండ సంకెల ల్వేయరాదె?

మొన్న [illegible] సేయువగద యింక ననుచు

గట్టిగా నన్ను [illegible] పెట్టరాదె?

యంతెకాని యీరీతి నలిగి యలిగి

పలుకకుండిన నేనెట్లు బ్రతుకవాఁడ?

సత్య—అయ్యయ్యో! అటనఁబోకుము. అట్లుచేయవలసినది రుక్మిణి. సరిసరి. [illegible] మహాదేవి మహాసత్కులసంజాతయై పతివ్రతాశిరోమణియై [illegible] బాత్రురాలయిన యాసుందరియా చందంబునఁ జేయవలయుఁ గాని యెందు నామెను బోలక వినయములేనిదానికి, నోర్పులేనిదానికి, నాకట్టి గౌరవ మెందుకు? నేను జీవన్మృతురాలను.

కృ—(చెవులుమూసికొని) అయ్యో! దేవీ! నీ వీ విధమున నమంగళములు [illegible] నాకు వ్యథ నేలఁ గలిగించెదవు?

సత్య—అబ్బే! పొరపాటుగాఁ బల్కుచున్నారు. నావిషయమయి మీకు విషాదముఁగూడఁ గలుగునా? రుక్మిణీదేవి మధురస్వరములతో బలుకకున్నను, జాంబవతి యాదరింపకున్నను, మిత్రవింద విందొనర్పకున్నను, భద్ర [illegible] బలుకపోయినను దక్కఁగలవారు [illegible] మీకు విషాద ముదయింపవలెను గాని నాకొఱకేల?

కృ—ఊ. ఏటికి భద్ర? జాంబవతి యేమిటి? కేటికి మిత్రవింద? యింకేటికినాకు నాగ్నజితి? యేటిరుక్మిణి? యెందు నీదుకా

లోటికి నైనసాటి యనఁగూడనిచోటుల నాపశ్రంస యి
ట్లేటికి మాటమాటకును నెత్తెదు మత్తగజేంద్రగామినీ!

సత్య—(కోపముతో) సందేహ మణుమాత్రములేక నీ వాక్రమమునఁ బలికెదవేల? ఆమాయలమారిమంచులు మీతల కెక్కినవి. ఆమె యాలాపంబులు మీచెవుల కమృతప్రాయము లయినవి. ఆమె మందిరము మీకు నందనబృందావనమైనది. ఆమెయే మీస్వర్గము, మీమోక్షము, మీప్రాణము. ఒక్కనిమిసమయిన నామె మీవియోగము సహింపఁజాలదు. వేవేగ నామెసన్నిధి కరుగుఁడు.

కృ—ఓమరాళగమనా! నీసదనముకంటె నామెవదనము నాకానందకరముగాదు. ఆమెకులుకులు నీయలుకలంత మనోహరములుకావు.

సత్య—మనోహరము లగుఁగాక, కాకపోవుఁగాక, నాకేల? ఆనారదుని సాహసమునకు నే నచ్చెరుపడుచున్నాను. ఆకలహభోజనుఁడేమిగాఁ దలఁచెనో? ఆరుక్మిణీదేవికిఁగల యాభిజాత్యము, సన్మానము, లావణ్యము నాకు లేవని తలఁచెనుగాఁబోలు! అతఁడు బ్రహ్మఋషిగాని దేవఋషిగాని భయపడువారెవరు? రుక్మిణి యగ్రమహిషియయినమాత్రమున స్తోత్రమున కర్హురా లయ్యెనా? ఆమెయంతటిదామెయు నాయంతటిదానను నేను. అముని నన్నుఁదూలనాడ మీ రెట్లూరకుంటిరి? రుక్మిణినిఁ గాదుగదా యనుకొంటిరి కాఁబోలును. నన్నాకలహాశనుండు నిందించుటకు మీరు తిట్టించుటకు నామె యాకర్ణించుటకు నేను మీదాసిననుకొంటిరా? రుక్మిణికి సేవకురాల ననుకొంటిరా? నారదుని పరిచారిక ననుకొంటిరా? ఏలినవేలవలె లేనిచో నూరకుండవలె. ఈకొంటెమాలిసపను లేల?

కృ—ఆనిర్జరముని పారిజాతకుసుమము నాకొసఁగినప్పుడు కొంచె మపప్రస్తుతప్రశంస చేసినమాట నిజము. దానికి నే నూరకుంటినని నీవు దలఁపకుము.

సత్య—(కోపముతో) ఆదేవఋషీశ్వరుఁ డమందకుతూహలమున భవత్సేవాపరాయణుఁడై వచ్చి యాపుష్పము మీకుఁ గానుకయిచ్చిన నిచ్చుఁగాక మీ రామరాళకుంతల నెంతయు మెప్పింప

నామెకిచ్చిన నిచ్చితిరి గాక నిరర్థకముగ మాపరిచారము లాహజారమున నేల రావలెను? వచ్చిన మీరేల యుపేక్ష చేయవలెను?

కృష్ణు—సుందరీ! మునులతోడి ప్రసంగములు త్రాచుపాములతోఁ జరలాటములు కావున మహానుభావుఁ డగు నాబ్రహ్మమానస పుత్త్రున కెదురాడిన నెటువోయి యెటువచ్చునో యని యించుక జంకితిని.

సత్య—అందుచేతఁ గాదు ప్రాణపదమగు రుక్మిణీకాంతను మెప్పిం పవలెనని మీవ్యాపారము నే నెఱుఁగనా? అనేక రాజకన్యలను జేపట్టి యందఱ మెప్పించు తలంపుతో సమయోచితంబుగ నిచ్చకము లాడుచు నిరంతర మబద్ధమే జీవనముగా కాంతాసేవయే వృత్తిగా విషయోపభోగా సక్తమనస్కుఁడవయి యుందువు. ఒకభార్యయా? ఒకలోకమా? దైవాను గ్రహమున నీయాదవవంశసంభూతులగు రాజులకు రాజ్యప్రాప్తి శాప మూలనమున లేకపోయెను. కాని కర్మముజాలక సామ్రాజ్య మున్నచో నీ నారీమండల సంబంధముచేత వ్యవహార మొనర్చుటకయినఁ దీరిక లేక పోవును. రాజ్యప్రాప్తి లేకుండుటయే మీకు మేలయ్యెను.

కృష్ణు—ఓసత్రాజిత్కుమారికా! ఆసర్వంసహారాజ్యము లేకున్నను నీదయవలన మదనసామ్రాజ్యము పూర్ణముగనున్నది. ఆరాజ్యమీరాజ్య మువలె సుఖముగానుండునా?

సత్య—(కొంచెము సిగుతో తలవంచుకొని) అవును. ఆవిభవము ముందును తరువాత దేవరవారును నవతరించిరను మాట జగత్ప్రసిద్ధమే కాని యేకాంత యెంతగౌరవమునకుఁ దగు నాకాంత కంత గౌరవంబొసఁగి సుఖపెట్టగల సామర్థ్యముగల యతఁడు బహుకాంతా పరిగ్రహంబు సేయ నొప్పును గాని తదితరుండు దక్షిణ నాయకత్వంబున కనర్హుడు. మీరు శ్రీవైష్ణవాంశ సంభూతుల రనియు, యదువంశోత్తంసులరనియు, నిష్పక్షపాతహృదయుల రనియుఁ దలఁచి మాతండ్రి సత్రాజిత్తు శమంతక మాణిక్యసమేతముగా నన్ను మీకిచ్చి వివాహముఁ జేసెను. ఇట్లగుట యెరిగినచో నత డే మొనర్చియుండునో? ఇంతకును పారిజాత కుసుమ వాసనలు నాకుఁ జూపి న న్నుడికింపఁ దలఁచి వచ్చితిరా? ఇంత మహాను భావులరని యెఱుఁగ నైతిని. (కన్నుల నీరు నించుచున్నది.)

కృష్ణు—...సంజనం...! ...జ...ను ...నా... ...కృష్ణ ...నా...ంగు టనే నేను ధన్యాత్ముఁడ నయితిని. నే నరుదెంచినది ని న్నుశిక్షించుటకుఁ గాదు. నావందనంబుల నీకుఁ దెలుపవచ్చితిని. కావున.

మ. కనులం దశ్రుజలంబు జాఱ మిగుల గంపింప నెమ్మేను క
నొనల న్గెంపు జనింప ముల్కులటు బల్కు లె మ్మదిం గాఁడఁగా
ననుఁ గుందించెదవేల నేరమయిన న్నారింపు చేకొమ్ము నం
దనము న్దాసుని తప్పు చెల్లునుగదా దండంబుతో సుందరీ!

సత్య—(కోపముతో) ధూర్తా! అతివినయము చాలును. (అని యెడమకాలితోఁ గృష్ణునితలను దొలగఁ దోయుచున్నది.)

కృష్ణు—ధన్యోస్మి! ధన్యోస్మి! ఓకలకంఠకంఠీ! నీవు నాదెసఁ గనఁబఱచిన యనూన గౌరవంబు శ్లాఘాపాత్రంబు. ఆమహోత్సవముచే నాకత్యంత మానందము జనియించినది. ఎలయన,

తే. గీ. నెలఁదు లెనమందు వైవాహ విధులయందు
పొనఁగ ముత్యాలతలఁబ్రాలు వోయునపుడు
వేల్పుటువిదలు నేసలు నెట్టినపుడు
కలికి! యింత యానందంబు కలుగదయ్యె.

సత్య—అట్టియానంద మింకొకమాటు కలుగఁ జేయుదునా?

కృష్ణు—ముఖ్యముగఁ గలుగజేయవలసినదే (తనలో) ఈచంద్రాసన మరల నన్నుం దన్నునాయేమి? ఓమరాళకుంతలా! నేనుధన్యుడ నైతిని. నాదేహము పావనమయ్యె. కులము వన్నె కెక్కె. జన్మము సార్థకమయ్యె. స్త్రీపాదతాడన మహోత్సవముచేఁ జరితార్థు లగుపురుషు లీ ప్రభాకర నిశాకర వంశములలేరు. నేనే ప్రథమగణ్యుఁడను. మరియును మదీయ శిరోభాగము రెండుపర్యాయములు కృతార్థతఁ జెందినది. మొదట నర కాసుర సంహారంబు గావించునాఁడు వాసవప్రముఖులగు గీర్వాణులు నన్ను దీవించి నేసలుగఁ జల్లిన పారిజాత సుమంబులచేతను రెండవది మంజుకనకమంజీర మంజులశింజితసమేతం బగు నీపాదపల్లవంబు చేతను. ఓమరాళకుంతలా! ఈకార్యంబు నాహృదయ రంజకం బయ్యెఁ గాని

కంటకప్రతిమానమత్కృతిన శిరోజసంపర్కంబున నీయరుణపల్లవ కోమలం బగుపదంబు కందినదో, నాకిరీటమాణిక్యంబులు తగిలి నొచ్చినదో, కోపోద్రేకపరవశత్వంబున నన్నుం దన్నుతరి నీనర మేదయిన బెణికినదో యని యత్యంతము భయపడు చున్నాను. ఒకవేళ నిది యనుచితమని నీవు సందేహింతువేమో?

మ. పరుఁడంగా నెద సందియంపడకు నీపాదారవిందద్వయీ
పరిచర్యం బొనరించి ధన్యతను సంపాదించు నీదాసుఁడ
న్పరమప్రీతుఁడ నైతి నీవిటుల సంభావించి చేపట్టుట
న్దరుణీ! దండన కర్హుఁడౌ మనుజుని న్దండించు టొప్పుంగదా!

కావున నింక నైన నల్కమాని చిలుకపలుకులు పల్కి నన్నాదరింపుము.

సత్య—(పశ్చాత్తాపముతో) అయ్యో! నేనెంత యదృష్టహీనురాలను. ప్రాణేశ్వరుని వామపాదంబున దన్నితినని యపనింద గలుగును గాబోలును. ఇంతదనుక మాయత్త దేవకీదేవి నన్నందరు కోడండ్రలో బెద్దఁజేసి యత్యంతగౌరవంబునఁ జూచు. ఇప్పుడు పతియెడ నవినయంబు జూపి యామె మొగమెట్లు చూతును? భర్తయెడ నొనర్పరాని దోసమొనరించిన యీమేనిపై నభిమానము విడిచెదను. ఛీ! ఈవ్యర్థ జన్మమేల? (కన్నీటితో) ఇంక మదీయ శయనాగారంబు లేకమలనయనపాలు గావలెనో? నామందిరోద్యానసీమల నేరామ విహరింప నోచుకొన్నదో? నాకీర, శారికా, మయూర, మరాళము, లేమరాళగమన నానందింపఁజేయునో? నాయేడువారముల నగలు నేమగువ ధరించునో? నా కాంచనాంబరము లేయంచయాన కట్టునో? [కృష్ణునిపైఁ దలజేర్చి] హా! ప్రాణనాథా! నన్ను మీరింత పరిభవించుటచేతఁగదా నాయవస్థ యిట్లుండుట.

కృష్ణు—[చిరునవ్వుతో సత్యభామ కన్నీళ్ళు తుడుచును]

తే. గీ. ఇంతలేసి సాహసములా యిందువదన?
యంతమాత్రపుఁబనికి నేకాంతమందుఁ
జేడియలొనర్చు శృంగార చేష్టలివియ
వేల్పుదొరకయిన నీయవి వేడ్కసేయు.

దేవీ! ఇంకవిషాదముతోఁ బనియేమి? ఏదికావలయునన్న నదియె యొసఁగుదును. ప్రసన్నవగుమ్ము.

సత్య—[సంతోషముతో] అట్లయిన గోరినదాని నిచ్చెదరా?

కృష్ణు—త్రికరణశుద్ధిగ నిచ్చెద. త్వరితముగ నడుగుము.

సత్య—అట్లయిన రుక్మిణి దగ్గరనున్న పారిజాతము నాకిప్పింపుడు.

కృష్ణు—దేవీ! ఒకరు ముడిచిన పారిపుష్పము నపేక్షింపనేల? అదియునుగాక నామెకిచ్చిన దానిని మరలఁ దెమ్మనుట యనుచితము.

సత్య—[కోపముతో] అవును. ఆరుక్మిణి నడుగుటకు మీ కధిక భయము. కావున నది యపేక్షింపఁ గూడదనుచున్నారు. ఆవిదర్భరాజపుత్రిక మీకుఁ బ్రాణము నామెకు మీరు ప్రాణము. నేను వ్యర్థముగ మిమ్మడుగుటయె కాని నామనోరథము సఫలమగునని యనుకొనలేదు. ఇంతమాత్రమునకుఁ గోరిక కోరుమననేల?

కృష్ణు—అట్లుకాదు. ఆరుక్మిణి కొకపుష్పమె యొసంగితినిగాని నీకుఁ జూడుము. ఆయమరలోకంబున కరిగి సమీర సమవర్తి, సముద్రేశక, సర్వభక్షకాదులగు దిక్పాలకులఁ గూర్చుకొని యాదేవేంద్రుడడ్డము వచ్చిన వచ్చుఁగాక.

ఉ. మానవతీవిభూష! విను మాట లిఁకేటికి? నీవు మెచ్చి యా
నె౯నన, నాశచీరమణి యచ్చెరువంద, వడంక ముజ్జగం
బే నమరావతీపురికి నేగి, జొరంబడి యిందిరానందనో
ద్యానము, పారిజాతవసుధారుహము న్గొని తెచ్చి యిచ్చెదన్.

సత్య—[సంతోషముతో] ప్రాణేశ్వరా! నాకంతటి మహాభాగ్యము గలుగునా?

కృష్ణు—సందియమేమి? పారిజాతవృక్షమును దెచ్చి నీమందిరోద్యానవన మధ్యభాగమునందుఁ గమలాకరతీరంబున మాకందపున్నాగమహీజములకు నడుమ మల్లికావల్లికలకు సమీపమున నాటించె

దను నీ కేళీవనం బొయిందఱినందనమ్ముమీరును, నీవాశచి మీఱుదువు.

సత్యా—జీవితేశ్వరా! ఈమాటలు ముమ్మాటికి నిశ్చయమే కదా! ఇదియే నిశ్చయమైనచో నేనాశచీదేవిని మించుటయెగాక రుక్మిణి మొదలగు సపత్నులకన్న నెక్కుడుదాన నగుదును.

కృ—దేవీ! ఈపటికే నీవు వారలకన్న నెక్కుడుదానవు. ఇఁక మీఁద నా పారిజాతపుష్పంబులు గోసి యనుదినంబును నీసఖీజనంబు లతిభక్తితో నీధమ్మిల్లయందు ముడువగా వహావ్వా యతిసుందరముగ నుందువుకాఁబోలును! అప్పుడు మేము జ్ఞాపకముందుమా?

సత్యా—(లజ్జనభినయించుచు) దేవా! కాఁగలకార్యమునుగూర్చి సంతోషింపరాదు.

కృ—దేవీ! కాదు కాదు. సహజలావణ్యముగల నీ వాస్వర్లోక సుమంబుల ధరియింప నెట్లుందువో యూహింప కున్నాను. అదియు నుగాక నాదేవీమండలమున నీసమానులు లేరు. నీవదనశరదిందు భాగ ధగ్యంబును, నీ నీలకుంతలముల నైగనిగ్యంబును నీయత్యధిక చాక చక్యంబును నేసుందరియందు గలదు?

శా. నీవిన్యాణము, నీయొయారమును, నీనిర్వ్యాజలావణ్యము,
నీ వాఙ్మాధురి, నీచమత్కృతులును, న్నీసౌరు, నీ కే తగు
న్దేవీ! నీ కెన రాఁదలంచి తపము న్వేయేండ్లు గావింప నీ
యానై దర్భికి రాదు నీవిలసనం బంభోజపత్రేక్షణా!

సత్యా—(సంతోషముతో) దానికేమికాని పారిజాతమునిమిత్త మిందఱిలోకంబునకు వెడలుదమురండు.

కృ—రేపుదయమునఁ బోవుదము కాని యమరలోకమున కేకారణముఁ గల్పించుకొనిపోవలయునో యెఱుఁగకున్నాను దేవతలు మనరాఁకకుఁ గారణ మడుగకపోరు.

సత్య—నాథా! కారణము లేకేమి? నరకాసురునిచేత మున్నప హరింపఁబడిన యదితికుండలములను మీరారక్కసుందునిమి తెచ్చిన దాది దేవరయె స్వయముగ నమరలోకంబునకుఁ బోయి దేవమాత కాకుండలముల నర్పింపవలయునని పలుమారు అనుచుండువారేకదా! ఇప్పుడావంక గల్పించుకొని మన మమరావతికిఁ బోవుదము.

కృ—అవును. చక్కనిమాట జ్ఞప్తికిఁ దెచ్చితివి. అట్లయిన సూర్యలోక ప్రయాణంబున నతులితచతురగల గరుత్మంతునిపై నధిరోహించి పోవుదము. కావున నీవును మందిరంబు కరిగి స్వర్గప్రయాణ ప్రయత్నము చేయుము.

సత్య—చిత్తము. (అనిపోవుచున్నది.)

కృ—ఈస్వర్గప్రయాణవార్త ప్రియమిత్రుఁడైన కైరవున కెఱిఁగించెద. అతఁడెక్కడ నున్నాఁడో?

(కైరవుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కైర—(తనలో) మావాసుదేవుఁడెందున్నవాఁడో? (ఇటునటు చూచి) అదిగో యిచ్చటనె యున్నవాఁడు. కాని ఇతఁడేదియో దీర్ఘాలోచనము చేయుచున్నట్లున్నవాఁడు. (కృష్ణునిసమీపించును.)

కృ—కైరవా! నీవుకూడ మాతో వచ్చెదవా!

కైర—ఎక్కడకు!

కృ—ఎఱుఁగవా! ఇంద్రలోకమునకు.

కైర—ఎందుకు?

కృ—పారిజాతముఁ దెచ్చుటకు.

కైర—ఎవరు తెమ్మనిరి?

కృ—సత్యభామ.

కైర—ఆమెనొక్కర్తెనె మీరింత గౌరవింపనేల?

కృ—నారదముని పారిజాతపుష్పము నొకదాని నిచ్చి రుక్మిణి నిదివఱకె గౌరవించెను.

కైర—అట్లయిన సత్యభామాదేవి మిమ్ముం బరుషోక్తులచే నొప్పించి యుండఁబోలు.

కృ—పరుషోక్తుల నాడుటయేకాదు. ఆమెకాలియందియల బంగారముతో నాతలకిరీటపు బంగారమును వియ్యమొందించినది. స్త్రీలెంత సాహసురాండ్రో చూచితివా? మనమున నీషన్మాత్రము సందేహము లేక యెంతపని చేసినదో!

కైర—(పెద్దపెట్టున నవ్వుచు) తన్నినదా? కాని మాధవా! ఆమె పరమమునియని మ్రొక్కితివా? లేక దేవుడా, గురువా, తల్లియా, తండ్రియా, ఎవరనుకొని మ్రొక్కితివి? వందనార్హయగు భార్యకు నీవు సందేహములేక వందనము చేయఁగా నామె సందేహింపక తన్నుట తప్పేమి? ఆమె నీకుఁ దగినభార్య. నీ వామెకుఁ దగిన భర్తవు.

కృ—మిత్రుఁడా! దానికేమిగాని యింద్రలోకముఁ జూచుటకు నీకింతకన్న సమయము దొరకదు. చూడఁగోరెదవేని రమ్ము.

కైర—(కొంచె మాలోచించి) మీరు గరుత్మంతునిపై నెక్కి పోవుదురు. నే నక్కడకూర్చుండియున్న పక్షమునఁ జల్లగాలి తగిలి నాకుఁ గునికిపాటువచ్చును. అంత మెత్తుననుండి పడితినేని చచ్చిపోగలను. లేకలేక మాతల్లికి నే నొక్కఁడనె కుమారుఁడను. నేను రాను.

కృ—అట్లయిన నేను వసుదేవ బలదేవాదులతోడను రుక్మిణి, జాంబవతి, మిత్రవింద మొదలగు నంతఃపుర కాంతలతోడను జెప్పి పయనమునకు సిద్ధమయ్యెదను.

కైర—నీవు ముం దరుగుము. నేనును క్షణములో వచ్చెదను.

కృ—మిత్రుఁడా! అంతఃపురకాంతలకు నేఁడీవార్తఁ జెప్పఁబోవు నపుడు నీవు నా సమీపమున నుండవలయును. కావున సత్వరమున రమ్ము. (నిష్క్రమించును.)

కైర—(తనలో) పురుషులు కాంతాజనంబులయెడఁ బ్రవర్తింపవలసిన తెఱంగులఁ బ్రవర్తింపరేని యిట్టివె చిత్ర్యంబులు సంభవించుచుండు. అదియునుంగాక బహుభార్యాపరిగ్రహణము సేయు నతఁడం దఱ మెప్పింపఁదలఁచి తుద కెవ్వరి మెప్పువడయలేక యెల్లరకు నాగ్రహపాత్రుఁడగును. ఇతఁడు రుక్మిణీదేవినిఁ బ్రసన్నురాలిఁ జేసికొనఁదలఁచి సత్యభామ కాగ్రహపాత్రుఁడయ్యె. సత్యభామ యనుగ్రహముఁ బడయఁ దలఁచి రుక్మిణి కలుక తెప్పింపకపోదు. తన యమరలోకప్రయాణవృత్తాంతము నంతఃపురస్త్రీల కీయన యెఱుఁగఁజేయునపుడు నన్ను దనతో నుండు మనియె. కావున నేనిప్పు డచ్చటి కఱిగి యామచ్చటలు ప్రసంగములు కని విని యానందించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)



శ్రీ

# పారిజాతాపహరణము



తృతీయాంకము.

ప్రదేశము—రుక్మిణీదేవి అంతఃపురము.

(రుక్మిణీదేవి ప్రవేశించుచున్నది.)

రుక్మి—(తనలో) ప్రాణేశ్వరుండు నాకు పారిజాతకుసుమము నొసంగుటచే సత్యభామ నిశ్చయముగా నాగ్రహించియుండును. ఆమె యేమన్నదో యెట్లన్నదో నామూలమున హృదయేశ్వరున కెట్టికష్టములు గల్గుచున్నవో తెలియకున్నదానను. మాకట్టికలహములు గల్గునోగదా! నారదమునీంద్రుం డేల పుష్పమును దేవలెను! హృదయేశ్వరుం డది నా కేల యీయవలయును! ఏమియుం దోఁచదు.

(అంతట నారదుఁడు ప్రవేశించుచున్నాడు)

నార—(తనలో)

తే. గీ. జగడ మున్నదినంబు పండుగదినంబు
కలహములు లేనినాఁడు లంఘనము నాకు
నీశ్వరానుగ్రహముచేత నింతదనుక
గడపుచున్నాఁడ దినములు కఱవులేక.

శ్రీకృష్ణుఁడు సత్యభామా ప్రేరితుఁడయి స్వర్గమునకుఁ బోవుటయు సత్యభామ యలుగుటయు, నీవిదర్భరాజనందన కెఱుఁగఁజేసెద. అంతటఁగాని యీకలహంబు పరిపూర్ణదశ నొందదు. నాప్రజ్ఞావిశేషంబుచేతనేగదా బ్రహ్మాద్యమరగణ పూజ్యమగు మాధవు శిరస్సును సత్యభామ యెడమకాలితోఁ దన్నినది. నాప్రజ్ఞలింకనుజూపెదను. ఇదిగో

రుక్మిణి యొంటరిగా నిందు కూర్చున్నది. సమీపించుట కిదియే మంచి సమయము. (సమీపించును.)

రుక్మి—(తనలో) ఏమి కారణంబుననో సురమునీంద్రుఁ డిటు వచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా) నారదమునీంద్రా! వందనము.

నార—సుందరీ! కళ్యాణమస్తు. ఎద్దియో దీర్ఘాలోచన చేయు చున్నట్లు గన్పట్టు చున్నావు.

రుక్మి—దేవా! ఆలోచనయే లేదు. కాని—

నార—కళ్యాణీ! నీస్థితిజూడ నాకు మిక్కిలివిచారముగ నున్నది. పాపము నీవేమి చేయఁగలవు? ఈద్వాపరయుగమున మంచివారికి దినము లు గావు.

రుక్మి—దేవా! అట్లను చున్నారేమి? మీ రూరక యట్లనరు. కారణమేమో వేగముగా నుడువవలయును.

నార—ఊరక యట్లులన్నాడను. కారణమేమియు లేదు.

రుక్మి—(ఆత్రముతో) అట్లని మీ రూరకుండుటచే నాయాత్ర ము నాపఁజాల కున్నాను. స్త్రీసామాన్యమునకుఁగల తొందరయంతయు నేఁడు మూర్తీభవించుచున్నది. ఆవిషయమై నాకు వడిగాఁ దెల్పి నన్ను నుగ్రహింపుడు.

నార—నిరంతరమును శ్రీమన్నారాయణ సేవాపరాయణుల మగు మాకు సంసారసంబంధము లగు గొడవలెందుకు? మాట వచ్చినది గనుక చెప్పవలసి వచ్చెను.

రుక్మి—దేవా! నిజము వక్కాణించుటకు మీ రింత శంకింపనేల? ఎంతమందలించిన శాంతింపని నాహృదయమునకు మీసుధారసమ భాషణములచే శాంతి యొసంగుఁడు.

నార—(తనలో) ఇంకనీ మెకు నేఁ జెప్పదలచినదేమో చెప్పెదను. (ప్రకాశముగా) సుందరీ! నీవు పట్టమహాదేవి వైనను, పరమసాధ్వి వైనను, శ్రీమహాలక్ష్మి స్వరూపురాల వైనను నీయందు లేశమును నీపాణేశ్వరు నకు గౌరవము లేదుగదా!

రుక్మి—అట్లయిన నే మానినియందాయనకు గౌరవముగలదు?

నార—పరమధూర్తయు, నీర్ష్యాగ్రహబాధ్యురాలును, నీకు నెడ తెగని బాధాకారిణియు నగు నీసవతి సత్యభామయుండదే. అంతకంటె నిక నెవరియుందురు? నీ సమీపమునం దున్నప్పుడు తేనెసోనలవంటి తియ్యని మాటల నాడునుగాని హృదయమందు సత్యభామయున్న చో మక్కువ మెండు. ఆమెపేరుచెప్పిన గడగడ వడంకును. ఆమె గీచినగీటు దాటడు. పాపము తెల్లనివన్నియు పాలును, నల్లని వన్నియు నీరునని యేది చెప్పిన నదియే నమ్మియున్న నీవంటి వెఱ్ఱిదానిని నే నెందునుజూడలేదు.

రుక్మి— దేవా! ఆమెయం దంతమక్కువ యున్నట్లు గుర్తేమి యున్నది. ప్రేమమున్న దని చెప్పుటకు దృష్టాంత ముండవలెగదా!

నార—అయ్యో! కన్నులుండియు గ్రుడ్డిదాన వైతివిగదా! నీ కా పుష్పమును మాధవుం డిచ్చినందుకు నాతనికి జరిగినగౌరవము నీ వెరుంగవు గాంబోలు!

రుక్మి—సత్యభామ యేమి చేసినది?

నార—నోటికిరానిమాట లన్నియు నని నిందారోపణముల జేసి యింతేయేల? చేయవలసిన యమర్యాదలన్నియుం జేసినది. నిన్నాడిన మాటలు నిన్ను చేసిననిందలు నేం జెప్పనురాదు. నీవు వినరాదు. అది యట్లుండం దుద కానందనందనుం డాసుందరీచరణారవిందములకు నమస్కరించెను.

రుక్మి—(ఆశ్చర్యముతో) సత్యభామకు ప్రాణేశ్వరుండు నమస్కరించెనా? ఎంతపని చేసెను? అయ్యయ్యో!

నార—సుందరీ! ఆశ్చర్య మొందెదవేల?

తే. గీ. క్షితిని పాలించు మూర్ధాభిషిక్తు లైన
నడవులందు వసించు మహర్షు లైన
విపుల ధనవంతు లైన నిర్వేద్యు లైన
పడంతుకలయొద్ద మగవారు బానిసీలు.

రుక్మి—దేవా! నేను మిక్కిలి సిగ్గుపడుచున్న దానను.

నార—నీవు దీనికే సిగ్గుపడుచున్న దానవు. అట్లు నమస్కారపురస్కారముగా బ్రతిమాలుచున్న ప్రాణేశ్వరుని తనయెడమకాలితో దన్నినది.

రుక్మి—కటకటా! ఎంతపని జరిగినది? తన్నుటయే? ప్రాణేశ్వరుం డంతట నేమిచేసెను? నాశరీరము కంపమెత్తుచున్నది.

నార—నీవు పరమశాంతవు గావున నీకు భయముగనున్నది. నీప్రాణేశ్వరుం డామెపై కోపపడెనని యనుకొనుచున్నావా? అయ్యది స్వప్నవార్త. సత్యభామా మహాదేవిమీఁద నలుగుట కాయనకు నోరువచ్చునా? అపని యొనర్చునది నీవే యైనచో నిన్నేమిచేయునో! సత్య నీవంటి వెర్రిదికాదు. ఆమెమాట యటుండనిమ్ము. కృష్ణు డెట్లూరకుండెనో? సర్వలోకపూజ్య పదారవిందుఁడగు తనొ్నొక యాఁడుది యట్లు పరాభవింప దానుగాన నోరెత్తక యూరకుండెను. గాని మరొక రూరకుందురా! పాపము నీస్థితియేమియు బాగుగలేదు. అవును. ప్రాణేశ్వరుం డందరనొక్కమచ్చునఁ జూడవలెనుగాని కొందరయెడలఁ బక్షపాతముఁ గనఁ బరచినచో దక్కినవారికిఁ జాలకష్టముగా నుండును. పక్షపాతమునకును, నవమానమునకును సాధ్వీమతల్లివి నీవోర్చుచుంటివి గాని మఱొక రైనచో నేమి చేయుదురో! ఇంతకు నీతలిదండ్రుల పూర్వజన్మసంపాదిత పుణ్య విశేషమున నీవంటి కుమారిగలిగినది. కార్చిచ్చు మధ్యమని చెప్పదగిన యీ సవతుల మధ్యమునఁ గాపురమెట్లు చేయుచుంటివో పరమాత్మున కెరుఁగును. ఆకృష్ణుని టక్కరితనంబునకును, నాలిముచ్చు చేష్టలకును, దొంగనవ్వులకును, దేనెమాటలకును, మాయా కార్యంబులకును గోపమేమో యెరుంగని నీవు దొరికితివి గనుక నాతని యాగడములు సాగుచున్నవి.

రుక్మి—నారదమునీంద్రా! పారిజాతపుష్పము మహాద్భుతముల నెన్నింటిని సృష్టించినది.

నార— ఆపుష్పము నైనను నేను బలవంతపెట్టిన కారణమున నీకిచ్చెనుగాని లేకున్నచో నిచ్చునా? సత్యభామ కీయవలెనని మనస్సులో పూర్ణముగా నున్నది.

రుక్మి—అందుచేతనే కాఁబోలు జాల సందేహించెను.

నార—ఆ! నిశ్చయమెరింగితివి. నిజము నిలుకడమీఁద దెలియును. నామాట యబదము కాదుగదా?

రుక్మి—దేవా! కలహమెందుకు? ఆపారిజాతపుష్పము సత్యభామ కిచ్చెదను.

నార—నీపుష్పమామె కెందుకు? నీవెంత నీపుష్పమెంత? ఈ మహాభాగ్యమామె కక్కఱలేదు. ఆమెకు ముల్లోకంబుల సాధింపఁజాలిన ప్రాణనాథుఁడుండ లోపంబేమి? ఇంద్రలోకంబునకరిగి పారిజాతవృక్షము నే పెల్లగించి యింతఁ డామె కిచ్చునఁట. ఇంద్రలోకప్రయాణము నీ వెఱుంగవు కాఁబోలును. సత్యభామయు నాతండును బోవుదురఁట. నీశాంతమే నిన్నింతవఱకుఁ దెచ్చినది. నీవొక్కమాఱెదిరించినచో నన్నియు జక్కఁబడును.

రుక్మి—(విచారముతో) నావంటి యదృష్టహీనురా లెందును లేదు. నాజన్మ మెందుకు?

నార—(తనలో) నాప్రయత్నమిప్పుడు పూర్తిగ నెరవేరినది. (ప్రకాశముగా) సుందరీ! నిష్కారణముగ నిజమాడి నిష్ఠురముఁ దెచ్చుకొంటిని. అయినను దాని నిజము నీకే తెలియును. కాని నీ మంచితనమే నీకు సంతాపకారణ మాయెను. ఒక్కసారి నీవెదురు తిరిగిన పక్షమున నీయధికారమే చెల్లును.

రుక్మి—దేవా! మీరు చెప్పినదంతయు నిశ్చయము.

నార—(తనలో) ఈపర్యాయము నామనఃపూర్తిగా కలహముదయింపఁజేసితిని. (ప్రకాశముగా) కళ్యాణీ! ఇంక నే నరిగెదను. (పోవును)

రుక్మి—(తనలో) ప్రాణనాథునకు సత్యభామయం దత్యంతానురాగము గలదని నారదమునివల్లభుండు వక్కాణించినదంతయు నిశ్చయమే. కానియెడల సర్వజనదుర్లభమగు పారిజాతమహీరుహము నా సత్యకేల యిచ్చెదనని ప్రతిజ్ఞ చేయును. ఆవృక్షమును హృదయేశ్వరుం డామె కిచ్చినచో జనుల కందఱకును నామెయందే మహాగౌరవ ముండును. ఇంతకు సత్యభామ నోఁచిన నోముల ఫలమట్టిది.

(అంతట కృష్ణుఁడును, కెరివుఁడును బ్రవేశించుచున్నారు.)

కృష్ణ—కరవుడా!

సీ. భోజనందనఁ జేరి పొలయల్కలనుఁ దీర్చి
సత్యభామనుగూడి సరసమాడి
జాంబవతీదేవి సల్లాపములనెంచి
మిత్రవిందను డాసి మేలమాడి
ముదమొప్పఁ గాళింది ముంగురుల్ సవరించి
లక్షణయడుగులఁ లాక్షఁ బూసి
భద్రచెక్కులమీఁద బత్రముల్ రచియించి
నగ్నజిత్తనయ లేనగవు మెచ్చి
పువ్వుబోండ్లకుఁ బొరపులు బొడమకుండ
పొడమినవి యంతకంతకుఁ బొదలకుండ
నందరమనస్సు లొకచాయ నలరఁ జేసి
యనుభవించుచు నున్నాఁడు నధికసుఖము.

అందుచేత మేము సురలోక ప్రయాణము చేయుటకు ముందుగా రుక్మిణితోఁ జెప్పవలయునుగదా?

కైర—అయ్యో! కాదామరి. భార్యదగ్గఱ సెలవు పుచ్చుకొనక పోయినయెడల మర్యాద దక్కునా?

కృ—సత్యభామనిమిత్తమే నింద్రలోకమునకరుగుచుంటి ననియు, నా మొక్క పారిజాతమహీరుహంబుదెత్తుననియుఁ జెప్పిన నాదేవి యేమనునో.

కై—ఏమనును. తనభాగ్యమునునిందించుకొనుచునూరకుండును.

కృ—కలహోదయముగాకుండ శాంతింపఁజేయజాలనా? రుక్మిణి మిక్కిలి సాధువు. అయినను దీనికిం దగు నుపాయమేదైనఁ జెప్పుము. నీవు మిక్కిలి నిపుణబుద్ధివిగదా!

కైర—ఎన్నఁడును నీకు భార్యల తగవులాటలలో నుపాయములు చెప్పలేక నాప్రాణము విసిగిపోవుచున్నది. అదిగో రుక్మిణి సమీపించుచున్నది.

కృ—మిత్రుఁడా! నేఁబోయి బయిమాలెద. నీవీద్వారముకడనుండుము. నాకొఱకెవరు వచ్చినను రానీకుము. (రుక్మిణిని సమీపించును.)

కైర—నాకింకే పనియే మున్నది. అట్లే చేయుదునులె.

రుక్మి—(తనలో) అదిగో జీవితేశ్వరుం డిటకే వచ్చుచున్నాడు. (లేచి) ప్రాణేశ్వరా! జయమగుంగాక!

కృ—ఓహో! శ్రీకృష్ణపట్టమహాదేవికాంబోలును! నీముఖారవిందదర్శనార్థమై నీహృదయేశ్వరుం డరుదెంచినాండిదిగో. ఏమీ? ఈ మందయాన చింతాక్రాంతయైనట్లు గనంబడుచున్నది. నాస్వర్గలోకప్రియాణప్రియత్న మెవరైనం జెప్పిరాయేమి?

రుక్మి—మీపట్టమహాదేవి సత్యభామ. నాకామాత్రి మదృష్టము కూడం గల్గునా? నేనే మీహృదయేశ్వరినైనపక్షమున పారిజాతవృక్షము నాకేయిచ్చుట కిష్టపడుదురు.

కృ—(తనలో) ఎవరో యీసంగతి నీమెకుం దెల్పిరి. (ప్రకాశముగా) కల్యాణీ! సత్యభామ యెట్లుపట్టపుదేవియగును? నిరుపమసౌజన్యనిలయవగునీ వెక్కడ? గర్వపూరితయగు సత్యభామ యెక్కడ? నీకును నామెకును హస్తిమశకాంతరము కలదు.

రుక్మి—ఈముఖప్రీతిసంభాషణలతోంబనేమి? త్వరగా నింద్రలోకప్రయాణోన్ముఖులుగండు. సత్యభామ మీయాలస్యమున కోర్వలేదు.

(అంతట సత్యభామ ప్రవేశించుచున్నది.)

సత్య—(తనలో) ప్రాణేశ్వరుండు రుక్మిణి మందిరంబున కరిగియుండు. నేనుగూడం జని యీయమెయొద్ద నాకలోక ప్రయాణమునకు ననుజ్ఞ వడసెద. ఇదిగో! కైరవుం డిచ్చటనేయున్నాండు (ప్రకాశముగా) ఓయీ! ప్రాణేశ్వరుం డెక్కడ?

కైర—రుక్మిణీమందిరంబున నున్నారని మీకెవరుచెప్పిరమ్మా!

సత్య—అట్లయిన నన్నాస్థలంబునకుం దీసికొనిపొమ్ము.

రుక్మి—దేవా!మీరిందు మసలవలదు. సత్యభామ యాగ్రహించును. వేగముగా నింద్రలోకమున కరుగుండు.

కృ—ఆసత్యభామ కోపమెంత? ఆమె సెలవేల?

రుక్మి—మీనిమిత్తమేగాంబోలు సత్య యిటు వచ్చుచున్నది.

కృ—(చూచితనలో) అయ్యో? నామాటలనీమె వినియుండదు

గద. కైరవుఁడీసత్రాజిత్కుమారిక నిచ్చటికేల తీసికొని రానలయును?
(ప్రకాశముగా) దేవీ! సత్యభామా! యిటువచ్చితివేల?

కై—రావలసినవా రందఱు వచ్చినతరువాతనే గదా జరగవలసిన చమత్కారమంతయు జరగుట.

సత్య—సురలోకప్రయాణమునుగూర్చి మాయక్కగారియనుజ్ఞ వడయుటకయి వచ్చితి.

కృ—మంచిపని చేసితివి.

రుక్మి—అమ్మాయీ! నీవినయము చక్కదనమునకు మెఱుఁగు దెచ్చుచున్నది. సత్యభామావిధేయునిచేత పారిజాతము ద్వారకానగరమున నాటఁబడుఁగాక!

సత్య—అక్కా! అటుగాదు. రుక్మిణీవిధేయుఁ డనుము.

రుక్మి—కాదుకాదు. సత్యభామావిధేయుడనిన విశేషార్థమున్నది.

సత్య—(కొంచెము కోపముతో) ఆవిశేషార్థ మేమో నాకించుక తెలియంబల్కుము.

రుక్మి—అమ్మాయీ! కోపపడకు. ఇందునేను నిజమే పలికితిని.

సత్య—కోపపడకుమని నన్ను మందలించుటకు నేనంత మహాకోపముగలదానను. నీవు పరమశాంతురాలవు కాఁబోలు!

రుక్మి—నాకేమిశాంత మున్నది? శాంతమునకు నీవు పెట్టినది పేరు. శాంతమునందు యోగులయినను నీకుఁ జాలరు.

కైర—వహావ్వా! వహావ్వా! వీరిమహావైర మనెడువహ్ని నిందాసంభాషణము లనెడు గాలిచే రాజి మండుచున్నది.

కృ—ఓసుందరులారా! నిష్కారణముగ నన్యోన్యతిరస్కారభాషణంబులతో నేలగలహింతురు? సమయాసమయములనైన నెఱుంగరేమి?

రుక్మి—కలహమాడుటకంటె మాకు వేఱుపని యే మున్నది?

సత్య—నీవంటిదాని కంతకంటె పనులేమియు నుండవు.

రుక్మి—కయ్యమునకు కాలుదువ్వెదవేల? ఊరకున్నకొలదినొక్కవరుసనే నల్లేరుమీఁదికి బండి పోయినట్లు నామీఁదికి నవలీలగ వచ్చెదవు.

సత్యా—ఊరకుండక నీవు చేయగల దేమున్నది?

రుక్మి—చేయగలదాన నై నపక్షమున నీ విట్లనగలవా? తంత్రము లచేతను మందులచేతను ప్రాణేశ్వరునిమనసు విరిచి నీయెడలో వేసికొన్నావు. నిన్నెవ్వ రేమిచేయగలరు?

సత్యా—(కోపముతో) ఏమీ! నోటికెంత వచ్చిన నంతయాడెద వా? నీకంటె నెక్కువమంత్రములు మందులు నేర్చినవా రెవ్వరును లేరు. పెద్దదాన వైన నీవు భర్తను నెట్లు స్వాధీనము చేసికొంటివో చిన్నవాండ్ర మైన మేమును నట్లె చేసితిమి. పాపము భూలోకమాతవు; ముద్దరాలవు; ఏమీ నీవగలాండితనము.

రుక్మి—నా వగలాండితనము నీ వెఱుంగవా? నీవంటి సుశీలయెదుట నేనువగలాండిని గానా! ఇంతగయ్యాళితనము కూడదు.

సత్యా—నావంటి గయ్యాళితో నీవుకాంగా వేగుచున్నావు. గుఱి వెందగింజ తనయడుగున నున్న నలు పెఱుగదట! పైకి మహాసాధువువలెం గనంబడుచు లోపలం గుట్రలు చేయు నీవంటిదానను నే నెట్లగుదును.

రుక్మి—పిల్లి కన్నులు మూసుకొని పాలుత్రాగి తన్నెవ్వరు చూడలేదను కొనునంట. నీగుణంబుల నందఱు నెఱుగుదురు. మనయిరువురసాధుత్వ కౌటిల్యముల నెఱుంగని వా రెవరు?

సత్యా—తన్నుం దాను మెచ్చుకొన్నదన్ను కొన్న ట్లే యుండును.

రుక్మి—చాలుచాలు. నీపాండిత్యము గట్టిపెట్టుము. అన్నాల హ్రాదయేశ్వరుం డున్నది యయినను జూడవేమి? ఇంతసిగ్గును విడిచిపెట్టితివేమి?

సత్యా—(మహాకోపముతో) ఏమీ! సిగ్గును బరిత్యజించితినా? నీవేమో పట్టమహాదేవివని నీయిష్టమునచ్చినట్లు నన్ను నిందింపం జూచుచున్నావు. నీయాధిక్యము నీవే యుంచుకొమ్ము. తారతమ్య మెఱుంగక మాటలాడుచున్నావు. అన్యభామాగర్వనిర్వాపణసాహససీమ యగు సత్యభామ యని నన్నెఱుంగుము.

రుక్మి—సకలలోకైక పూజ్యుండును శ్రీమన్నారాయణావతారుండు నగు ప్రాణేశ్వరుని నీయెడమకాలితో దన్నినప్పుడే నీసాహసము నే నెఱిగితిని. నేనే కాదు. ముజ్జగంబులవారు నెఱుంగుదురు. ఎంతసాహసు

రాలవుకాకపోయిన నంతపనిచేసి తిరిగి తగుదునమ్మాయని నలుగురిమొగ ము నెట్లు చూచి బ్రతికియున్నావు.

సత్య—పారిజేశ్వరునకు జరిగినగౌరవము నీకుఁగూడ జరుగవల యునా యేమి?

కైర—మాధవా! ఈమె యందరను వరుసపెట్టి తన్నునా యేమి?

కృష్ణు—సుందరులారా! నామాట వినరుగదా? అమితానురా గము గలిగిన పరస్పరమైత్రిం జెందుటకు మాఱుగా నిట్లు కలహమాడుట న్యాయ మగునా?

సత్య—నావలన లోప మే మున్నది?

రుక్మి—పారిజేశ్వరా! ఇందు నాతప్పే మున్నది?

కైర—ఎవరెవలనను లోప మేమియు లేదు.

సత్య—ఎవరితప్పు వారికి తెలియదు.

రుక్మి—తెలిసినపక్షమున జక్కగా నుండును.

సత్య—తెలియకపోవుటచేతనే యింతమట్టుకు వచ్చినది.

రుక్మి—ఎంతమట్టుకు వచ్చిన నా కేమిభయము?

సత్య—నాకే భయమున్నది?

రుక్మి—నీకు భయము లేదన్నమాట నే నిదివరకే యెరుగుదును.

సత్య—నీకు సిగ్గులేదన్నమాట నే నెఱుగుదును.

రుక్మి—నీసాంప్రదాయమునుబట్టియు, నీబుద్ధిలక్షణంబులబట్టియు నీ మాటలు వచ్చుచున్నవి.

సత్య—నాసాంప్రదాయమునుగూడ నిందింపవలెనుగా? నీయన్న గారు నీస్వయంవరమహోత్సవసమయమం దెంతపరాభవ మొందెను.

రుక్మి—నీ సాంప్రదాయము మాత్రమే మంత వెలిగినది? శమంతకమాణిక్య మపహరించినాఁడని మాధవుపై నపనిందవైచినసత్రా జిత్తునుమారివిగావా? నీతండ్రివలెనే నీవును నిష్కారణముగ నితరులపై నిందల వేయుచుందువు.

సత్య—నీవలె నేను దొంగపెండ్లి చేసికొనలేదు.

రుక్మి—నీవలె మగనిని తన్ని యింద్రలోకమునుండి పారిజాత

ముఁదెప్పింపఁ దలచుకొనలేదు.

సత్య—తెప్పించుకొనుటకు స్వాధీనముఁ జేసికొనుటకు నాకు సామంతము కలదు. నీయోర్వలేమి నిన్నే కొట్టినది. తనకు లేదని విచారించిన నొకకన్ను నెదుటవారికిఁ గలదని విచారించిన నొక కన్నును బోయినదట. అప్రయోజకురాలవు! నీ వెందుకుఁ. జేతకాని దానవు గావున నీపుణ్యమట్లున్నది గాని నాకేమి?

రుక్మి—నీకుఁ గలమహదైశ్వర్యం మేమి? నేనోర్వలేని దేమి?

కైర—ఇఁక నీ కలహామున కంతములేదు కాఁబోలు!

కృ—[తనలో] అయ్యో! ఈకాంతామణు లిరువురు నొకరికం టె నొకరుమాటలయందుఁ దీసిపోరు. వీరి కలహ నివారణోపాయము నాకుం దోచకున్నయది. ఏమిచేయుదును. ఈపారిజాత మేమి కష్టము దెచ్చినది? ఏమి చేయుదును? [ప్రకాశముగా] ఓ రుక్మిణీ! ఓ విదర్భ రాజనందనా! నీవయిన నూరకుండవుగదా? [చేయిపట్టుకొనును.]

రుక్మి—[చేయి విదల్చుకొని నాయందున్న ప్రేమమంతయు నేఁడు తెలిసినది. చాలుఁజాలు. నన్ను బతిమాల నక్కఱలేదు.

కృ—[సత్యభామ చేయి పట్టుకొని] ప్రాణేశ్వరీ! నామాట చెల్లించి కలహ నివారణము గావింపవుగదా?

సత్య—[చేయి విదులుచుకొని మొగముఁ ద్రిప్పి] నన్ను బతిమాలెద రేల. అదిగో మీయర్ధశరీరంబును, మీ పట్టపుదేవియు నగు విదర్భరాజనందన. నాదగ్గఱ కేల వచ్చెదరు?

కృ—ఓ పట్టపుదేవీ! నీకుకోప మేటికి? ఊరకుండుము.

రుక్మి—పట్టపుదేవిని గాఁబట్టియే దగ్గరనుండి సత్యచే నిట్టి కఠినోక్తుల నాడించితిరి. సరిసరి. నా సమాచారము మీ కెందుకు?

కృ—భామాశిరోరత్నమా ! సత్యభామా ! హృదయేశ్వరీ ! నన్నిట్లు తిరస్కారము మొనర్ప భావ్యమగునా?

సత్య—హృదయేశ్వరి నగుటచేతనే పట్టపుదేవిని వెనుక వేసికొనివచ్చి అనరాని మాట లనిపించితిరి. నన్నామె నిందించు చుండగా వినినారుగదా. మీ చెవుల పండువుగా నున్నదా! ఆమెమాటలు మీ

కింపుగ నున్నవిగదా?

జై ర——మాధవా! ఇద్దరుభార్యలనడుమనుదిరుగుచుండుటచేతకాళ్లు నొప్పులెత్తుచున్నవి కాఁబోలు. నిన్నుఁ జూడ నాకు జాలివేయుచున్నది.

కృ——ఓకాంతలారా! మీరు పావనతర సుక్షత్రియ వంశసంజాతలనియు, నగణ్యతారుణ్యలావణ్య శోభితలనియు, నిరుపమాన సద్గుణ నిలయలనియు, మిమ్ము వివాహమాడితినిగాని క్షణక్షణాగ్రహపీడితలయి నాకెంత మనఃక్లేశ మొసంగుదురని కాదు. ఓసత్యా! నిరుపమాన యశో విభ్రాజితుఁ డగు సత్రాజిత్తున కపఖ్యాతి సంఘటించుటకు నీకు సందేహము లేదుగదా?

సత్య——(రోసముతో నేడ్చుచు) న్యాయందేమియు లోపము లేకపోయినను, నన్నే యవమానించున్నారు. పక్షపాతముచే మీకు న్యాయాన్యాయములు తెలియుటలేదు. నన్ను మీరెప్పుడు నిట్లే పరాభవించుచుందురు.

జై ర——వివాదములు పోయి దుఃఖము బయలుదేఱినది. తొండముదిరి యూసరవెల్లి యయినది. బ్రతిమాలుకొనువా రున్నట్టయిన బొల్లిబొల్లియేడ్పు లెన్నియైన నేడువ వచ్చును.

కృ——సుందరీ! సత్రాజిన్నందనా! నేను నీయందు నేర మెంచ లేదు. ఓరుక్మిణీ! విదర్భరాజపుత్రికవుగదా! నీవు సత్య భామ వయస్సున నీకంటెఁజిన్నది. ఆమెకంటె జిన్నదానవుగ నుండునట్లు కనఁబడుచున్నావు.

రుక్మి——అందఱు భార్యలలోను దేవరవారికి లోకువ నే నొక్కరెనే. మొగ్గని వారిని చూచిన మొగ్గుబుద్ధిగదా!

కృష్ణ——యుక్తాయుక్త పరిజ్ఞాన విహీనముగ నిట్లు మాటలాడుచుండ నేనేమి చెప్పఁగలను?

జై ర——నే నీబ్రాహ్మణజన్మ మెత్తకుండ శ్రీకృష్ణునిభార్యలలో నొకరెనై పుట్టినయెడల నాముచ్చటఁ దీఱునట్లు బ్రతిమాలించు కొందునుగదా! నన్ను బతిమాలువారే లేరు.

కృష్ణ——ఓశరచ్చంద్రముఖి! రుక్మిణీ! కలహనివారణ మగునట్లు నీ వీ సత్యభామతో మాటలాడుము.

రుక్మి—నావలన లోపమేమున్నది. నే ముందుమాటలాడను.

కృ—ఓ సత్రాజిత్కుమారీ! రుక్మిణి నీకంటెఁ బెద్దది. కావున నీవే ముందుగ మాటలాడుట ధర్మము.

సత్య—నావలన లోపమేమున్నది? నేముందు మాటలాడను.

రుక్మి—ఎవరివలన లోపమున్నదో యీ కైరవు నడిగెదము. ఓ యీ కైరవా! నావలనఁ దప్పుకలదా?

కైర—అమ్మా! మీయందు లోపము లేశము లేదు.

సత్య—అట్లయిన నాయందా లోపమంతయు నున్నది?

కైర—తమయం దంతకంటెలోపము లేదు.

రుక్మి—అదియేమి సాక్ష్యమయ్యా బ్రాహ్మణుఁడా! ముందుగా నెవ్వరెవ్వరి నేమాట లనిరో చెప్పు.

కైర—గురువుగారు చెప్పిన పాఠములే జ్ఞాపక ముండని నాకు మీ తగవులెట్లు జ్ఞాపక ముండును? అయినను జ్ఞాపకము చేసికొని చెప్పెదను. కొంచెము సేపు మీరూర కుండుఁడు.

రుక్మి—(తనలో) ఈతఁడు నాపక్షము పలుకఁడా?

సత్య—(తనలో) ఈతఁడు నాపక్షము పలుకఁడా?

కృ—(తనలో) ఈ కైరవుఁడు నిష్పక్షపాత చేతస్కుఁడు.

కైర—ముందు రుక్మిణీదేవిగారు సత్యభామాదేవిగారిని నిందించినారు. అంతకంటె ముందుగా సత్యభామాదేవిగారు రుక్మిణీదేవిగారి నన్నారని జ్ఞాపకము. ఒకరు, ఒక కారణముచేత నొకరిని ముందుగా నొకమాటొకమాట, నొకప్పు డన్నారు. వెంటనే రెండవవారు, రెండవ వారిని, రెండవమాటు రెండవమాటను రెండవకారణముచే, రెండురెట్లు కోపముతో నన్నారు. అదే నేనెఱిఁగిన సంగతి. మీఁదమీచిత్తము.

కృ—నీ చమత్కార మంతయుఁ దెలియునట్లు మిక్కిలి హాస్యాస్పదముగ సాక్ష్యమిచ్చితివి.

రుక్మి—ఇట్లసందర్భముగా సాక్ష్యమిచ్చినందుల కీ కపట బ్రాహ్మణ కుమారుని శిక్షింపవలెను.

సత్య—తప్పక శిక్షింపవలెను.

కై ర—నాప్రాణమువిూఁదికి వచ్చినది. దేవా! నాకే శిక్షనిర్ణయించినను సరేకాని సహస్రజన్మములకైనను నాకిద్దరుభార్యలనుమాత్రము గట్టిపెట్టవద్దు. అది నాపగవాండ్రకైనను వద్దు మహాప్రభూ!

రుక్మి—(తనలో) ఇతఁడు చమత్కారవచన రచనలచే మాకు సిగ్గు గల్పించినాఁడు.

కృ—(తనలో) కైరవుఁడు కడుచమత్కారముగాఁ బల్కినాఁడు. రుక్మిణి యీగర్భార్థ్రలం దెలిసి కలహము మానును.

రుక్మి—అమ్మాయీ! సత్యభామా!

సత్య—(పలుకక తనలో) ఈస్నేహముల కేమిలే.

కృ—(సత్యభామతో రహస్యముగా) నీవు విదర్భరాజనందనతో బ్రత్యుత్తరమిచ్చి పలుకవేని మనయింద్రలోకప్రయాణమాటంకమగును.

సత్య—ప్రాణేశ్వరా! అట్లయిన మాటాడెద. అక్కయ్యా! కోపావేశముచేత నన్నుమాటలఁ దలఁచుకొనకు.

రుక్మి—అమ్మా! నాయెడల తప్పులున్న క్షమింపుము.

కై ర—ఇప్పుడు నాబెదరు తీరినది.

కృ—ఓవిదర్భరాజపుత్రీ! ఇంద్రలోకప్రయాణ సన్నాహముతో నున్న మాకు నీయనుజ్ఞ నిమ్ము. నీయాజ్ఞ లేక నేఁగదలువాఁడను గాను. ప్రాణేశ్వరీ! సత్యభామా! సెలవుఁ గైకొనుము.

సత్య—అక్కయ్యా! అనుజ్ఞ నిమ్ము. మేమింద్రలోకంబున కరిగి మరల వచ్చెదము.

రుక్మి—అమ్మాయీ! అట్లుపొమ్ము, ప్రాణేశ్వరా! వేగముగా రండు. మీయాలస్యము సహింపఁజాలను.

కృ—ప్రాణేశ్వరీ! పోదమురమ్ము

(తనలో) తే. గీ. నేల నాలుగు చెఱఁగుల నేలవచ్చు
నాజిఁ బగతుర నవలీల నదమవచ్చు
నిపుణమతి బ్రహ్మవిద్యయు నేర్వవచ్చు
నంతిపురి స్త్రీలజగడంబు లడఁపరాదు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# పారిజాతాపహరణము

## చతుర్థాంకము.

---

ఇంద్రలోకము

రంగము—మందాకినీ నదీతీరము.

[సత్యభామయుఁ గృష్ణుఁడును బ్రవేశించుచున్నారు]

సత్య—ఆహాహా! ప్రాణేశ్వరా! అతివేగంబున వచ్చితిమి. మన మాద్వారకానగరమును బాసి యెంతసేపయినది?

కృ—దేవీ! ఒకజామయినది. అతివేగముగనే వచ్చితిమి. ఎట్లనిన గరుత్మంతుని యొక్క—

చ. అగణితపక్షవేగమున నట్లు జనించినగాలిచేత నో
మగువరో! యిట్లునట్లుఁ బలుమాఱులు నీవలెనాటు పైఁటచెం
గెగురుచునుండ నీవు నదిమెంతొ చిరాకునుఁ గూర్చుచుండ సొం
పగుచక్రవాకయుగ మప్పుడు దాఁగురు మూఁత లాడెఁగా.

సత్య[సిగ్గుతో దలవంచి] ప్రాణేశ్వరా! ఇది యే ప్రాంతము?

కృ—ఓసత్రాజిన్నందనా! ఇది ఇంద్రలోకప్రాంతము. మందాకినీతీరము. శ్రీమన్నారాయణపదజాతంబగు నీనది త్రికూటముపై మూఁడుపాయలై నది.

సత్య—ఆపాయ లెందెందుఁ బాఱుచున్నవి.

కృ—సకలలోక పవిత్రీకరణస్వభావమై, మందాకినీ నిర్మలనామంబున, నాకాశవాహినియై యిందును, భూమండల మండనంబై భాగీరథినామంబునను, పాతాళప్రపంచ పావనసమర్థంబై భోగవతి యను పేరను, ప్రసిద్ధమైనది. బ్రహ్మనిఖిల నిర్జరగణాధారం బయినదియు, శ్రీ

మహేశ్వరజటాజూటంబున నిల్చినదియు, జహ్నుముని కర్ణజనితంబగు నదియు, భగీరథనీతంబగునదియు నీమహానదియే.

సత్య—అవు నదిగో! అరవిందమ్ముల మధ్యమ్మునఁ జేరి కుతుక బంటిగఁ దేనెగ్రోలి తమ్ము నెరుంగక నిమ్మగుసంతసమ్మున జుమ్మని నిన దమ్ములం జేయు, మధుపమ్ములఁజూచి యిది నదియనుకొంటిని. కాని యీ యమరలోకప్రవేశముఁ గావింపక ముందే యీ లోకనాయకుఁ డెవ్వరో యతని పరిపాలనాసంతుష్టు లెవ్వరో యెరుంగఁజేయుడు. ఏదానిం గూర్చిగాని ముందువిని తదనంతరంబు దానింగనిన సంగతి పరిపూర్తిగా దెలియును.

కృష్ణు—హేలావతీ! యీలోకంబున కధీశ్వరుండింద్రుండు. అతం డనంత శాంతోదారగుణుండు. అపార ధైర్యధుర్యుండు. వజ్రాయుధస్ఫార ప్రశస్తహస్తుండు. ఆతనిభార్య శచీదేవి. ఇందిరానందన సుందరుండగు జయంతుం డాతని పుత్త్రుండు. ఐరావతం బాతఁ డెక్కుభద్రగజంబు. ఉచ్చైశ్శ్రవం బామహాత్ముని హయంబు. నందనవన మాతని పూవుదోట. అందే మనపారిజాతం బున్నది. అతఁడే స్వర్గమర్త్యపాతాళంబులకు నేక చ్ఛత్రాధీశ్వరుఁడు. అతనిరాజధాని సకలమునిగణాశ్రితంబగు నమరావతి. అది నిరంతరసచ్చిదానందనిలయంబు. సకలసౌఖ్యాకరంబు. అఖిల వైభవ రత్నాకరంబు. అఖిల కళావిద్యాశోభితంబు. అతిశ్రదశ సభామధ్యంబున బలశాసనుండు మెండుసంతసంబున నిండుకొల్వుండఁగా దేవకిన్నర కింపురు ష సిద్ధచారణ, విద్యాధర, గరుడ, ఖేచరాదులును, నారదవసిష్ఠాది నాగ లోకమునీంద్రులును గొలుచుచుందురు. రంభోర్వశీ మేనకాద్యమరవేశ్యా కాంతలు నృత్యగానవినోదంబులచే బలసూదనునకు మోదంబు గల్గింతురు. మరియు లోకక్షేమకరయుద్ధంబులఁ బ్రసిద్ధంబుగ మృతినొందువారును, యజ్ఞా దికర్మంబుల నిర్మలమతి నొనరించు ధర్మాత్ములును, సౌఖ్యంబుల ననుభ వింప నిచ్చోటికివత్తురు. అదియునుగాక యీత్రిలోకపాలుం డపరదిక్పాలక సేవితుండు. ఈతండు ప్రాగ్దిశాభాగంబున కధీశ్వరుడు. అల్లదే యతని పట్టణము చూడుము. ప్రాకారకుడ్యచితవజ్రధాళధళ్యంబును, గగనాతీత

సోపానస్థితేంద్రనీలమాణిక్యమై నగనిగ్యంబును, కాంచన స్తంభములపై ఖచితంబులయిన బహురత్నములధాగధగ్యంబును, నేత్రంబులకు మిరుమిట్లుగొల్పుచు, కెందామరపుష్పంబులచేతను, దెల్లగలువలచేతను, సొంపు మిగిలియున్న సరోవరంబుచందంబున నెట్లు భాసిల్లుచున్నదో చూడుము.

సీ. శతృభీకరమైన జంభారిజయరమా
నూపురం బగుజుమీ యీపురంబు
కడలేకవర్ధిల్లు కళ్యాణములకెల్లఁ
గాపురంబగుజుమీ యీపురంబు
యీరేడుజగముల నెనలేనిసిరులకు
దాపురం బగుజుమీ యీపురంబు
అధికతేజశ్శాలి యమరనాయకుఁ డుండు
ద్వీపురం బగుజుమీ యీపురంబు
కల్పవృక్ష పంచకమును కామగవియు
నమృతకలశంబు నందనోద్యానవనము
నేపురంబును బాయక యెప్పుడుండు
నాపురంబగు నీపురం బోపురంధ్రి!

సత్య—జీవితేశ్వరా! అది చూచితిని గాని యీయింద్రుండు తూర్పుదిక్కున కధీశ్వరుండని సెలవిచ్చితిరి. మిగిలినదిక్పాలకు లాకొదువ దిక్కుల కధీశ్వరులా? అట్టయిన నెవ్వరెవ్వ రేదిక్కున కధీశ్వరులో యందు ముఖ్యులెవ్వరో సెలవిండు.

కృష్ణు—కీరవాణీ! ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు, దిక్పాలకశ్రేష్టులు. అందునిందుండు ప్రాగ్దిశకును, అపరిమిత సత్యనియముండగు యముండు దక్షిణదిక్కునకును, పరాక్రమాభరణుండగు వరుణుండు పశ్చిమదిక్కునకును, శత్రువిదారుండగు కుబేరుం డుత్తరదిక్కునకును నధిపులు. అందాయింద్రుచరిత్రంబుఁ జెప్పితిఁగదా! దక్షిణదిక్పాలుండగు నాకాలుండు నిర్వర్తించు కార్యంబులం దెలిపెదవినుము. అనృతప్రలాపంబులాడి, నిరంతరదురాచారులై పరనారీలోలురై అన్యద్రవ్యాపేక్షకులయి పరహానికరులయి నిర్దయాహృదయులయి జంతుఘాతుకులైయుండు

మహాపాతకులాతని లోకంబుఁ జేరుదురు. వారిసందర రౌరవాద్యనేక మహానరకంబులఁ బొలియించి బాధించుచుండును. అందినుపముక్కులుగల కాకులు,నగ్ని స్తంభములు,నగ్నికుండంబులును,రక్తప్రవాహంబు నుండును.

సత్య— దేవా! మరణాంతంబున నిట్టిదారుణబాధలు గలుగునని యెరింగియు నీ జనులు పాపంబులఁ జేయుదురా? అందరు పుణ్యమునే చేయుదురనియును నీలోకంబున కెవ్వరు రారనియుఁదలంచెదను.

కృష్ణు— కళ్యాణీ! ఎంతదానవు. శ్రవణ, దర్శనభయంకరంబులగు నింతటి మహానరకంబు లుండుటచేతనే యూఁగెనుగాని, లేకున్నచో లోకంబాగకనేపోవును. ప్రపంచమున సధర్మకార్యాసక్తులును, బాపాత్ములును యధికంబుగనుందురు. ఎల్లవారును వీలయినచోఁ బాపకార్యావలంబనంబుఁ జేయుదురుగాని పుణ్యకార్యంబు నవలంబింపరు. అందుచేత జనం బీలోకంబున నెక్కువయుందురు. అది యటుండనిమ్ము. పశ్చిమదిగధీశ్వరుం డయిన వరుణదేవుండు భూమండలమునఁగల సకల సముద్రమ్ముల కధీశ్వరుం డయియుండును. ఈతండు పాశాయుధ శోభితపాణియై సకలపాపసంఘంబుల లంఘించి బాధించును. మరియును నుత్తరదిక్పాలకుండగు కుబేరుండు శ్రీమహేశ్వరప్రాణమిత్రుఁడు. ధనంబునకెల్ల నాతఁడు ప్రభువు. అతనిపురం బలకాపురంబు. అతనికుమారుండు మారసుకుమారుండగు నలకూబరుఁడు. అతని ఆయుధంబు మహాఖడ్గంబు. మరియు బరాక్రమహార్యక్షులగు యక్షులకు వల్లభుండు. వీరు ముఖ్యదిక్పాలకులు.

సత్య—ప్రాణేశ్వరా! తక్కిన దిక్పాలకు లెవ్వరు?

కృష్ణు—ప్రాగ్దక్షిణభాగంబుల నడుమనున్న మూలదిక్కున కధీశ్వరుం డగ్నిదేవుండు. అతండు సకలయజ్ఞహవిర్భాగంబులందెచ్చి దేవతలకు నివేదించును. ఆమహాత్ముని కారణంబుననే సకలలోకప్రజలును నగ్నిహోత్రంబు గలిగి సుఖింతురు. మరియు దక్షిణ పశ్చిమ దిక్కులకు మధ్యమున నిర్ఋతియను దిక్పాలకుం డుండును. అతండు రాక్షసుండు. మరియు పశ్చిమోత్తరదిక్కులకు మధ్యమునున్న భాగమునకు వాయుదేవుం డధీశ్వరుండు. అతండు నిజసంచారవిహారంబులచేత లోకంబుల కుపకారంబుఁ జేయుచుండును. సకలభూతజాలంబులకును వాయువే

ముఖ్యుండగుటచే నీవందు ముఖ్యప్రాణుండనియు, వాయుదానమునే సకల లోకరక్షకుండగుటచే జగత్ప్రాణుండనియును బిరుదులు గలిగియుండును. అదిగాక శ్రీరామపాదారవింద భక్తుండగు నాంజనేయుండును, ధార్త రాష్ట్రమృగకంఠీరవుండగు భీమసేనుండును నీవాయుపుత్రులే సుమీ! మరియు దైత్యకాననకృశానుం డగు నీశానుం డెనిమిదవ దిక్పాలుండు. ఇదియే దిక్పాలకుల వృత్తాంతంబు.

సత్య—ప్రాణేశ్వరా! ఈస్వర్గలోకవృత్తాంతంబును, దిక్పాలకుల వృత్తాంతంబును, సమగ్రంబుగ మీరు నాకెరుంగఁజేయుటంజేసి శ్రవణ పావనం బైనది. ఇంక యిందో్రద్యాన వనంబునకరిగి జగద్విఖ్యాతంబగు పారిజాతంబుఁ దెచ్చికొందము రండు.

కృష్ణు—దేవీ! అట్లుకాదు. వేగిరపడఁబోకుము. మనము జన్మంబున కొక్కసారి స్వర్గలోకమునకువచ్చి, యందు స్తోత్రపాత్రమ్ములగు విచిత్రమ్ముల దర్శింపకపోవుట యుక్తమా? అందుచే నీదిక్పాలకులను వారి భార్యలను దదీయపురంబులను నవలోకించి యనంతరం బచ్చుట కరిగెద ము. ఇంద్రలోకంబునకువచ్చి యింద్రునిఁ జూడకపోవుట భావ్యంబా? అదియునుఁగాక—

మ. దితిజశ్రేణి నడంప నబ్బలిని బంధింపంగ ము న్వామనా
కృతి నేఁ దాల్చినయప్పు డ య్యదితికూర్మిన్ దల్లినై యుండుటన్
శతమన్యుండు సహోదరుం డగుట నాచార్యుండు గానన్ బృహ
స్పతియున్ వంద్యులు నాకు పోవవలదే వారిన్ విలోకింపఁగాన్.

మరియు నాకారణంబుననే నాకేంద్రుఁ డగ్రసహోదరుండు. అం దుచే జననియగు నదితిని జూచి యవ్వల నింద్రునిఁ జూతమురమ్ము.

సత్య—దేవా! అది యవశ్య మాచరణీయంబు. గురుజనవంద నంబునకంటె హితకార్యం బేదియును లేదుగదా! సత్వరముగ పోవుదము రండు. (అని యిద్దరును నిష్క్రమించుచున్నారు.)

రంగము—ఇంద్రసభ.

[ఉచితపీఠమున, గూర్చుండి యింద్రుఁడు, యముఁడు, బృహస్పతియును నగపడుచున్నారు.]

ఇంద్ర—ఆచార్యోత్తమా! బృహస్పతులవారు

చ. హరికరుణారసంబు మెయి నాగతి నాబలిచక్రవర్తిను
దురతను గెల్చి రాజ్యమును ద్రొబ్బి యొసంగిననాఁటనుండి నా
కరిభయ మింతలేదు సుఁడీ యాహరి నా కనుజుండె గాన మీ
కరుణయు శిష్యవత్సలత కారణమేగద దాని కంతకున్.

యము—అది నిజమే. అఖిలదైభవమూర్తియగు నాబలిచక్రవర్తిని, జతుర్దశభువనకంటకుఁడగు దశకంఠుని, సకలలోకశిక్షాదక్షులగు హిరణ్యాక్షహిరణ్యకశిపులను నింకను సకలలోకబాధాకరగంభీరదోస్తంభ విజృంభితులగు రాక్షసాధములను నారాయణుండు వధియించెను. ఆమహనీయునికటాక్షంబుననే యీయక్షయలోకంబు రాక్షసభాధలేక యక్షీణసౌఖ్యంబు నొందుచున్నయది.

బృహ—మహేంద్రా! ఓయముఁడా! పరాక్రమపరాయణుఁడగు నారాయణుండు గొందఱ దైత్యులను భక్తజన సులభుఁడగు నాశంకరుండు కొందఱదైత్యులను వధియించిరి. వారిరువురు నుండభయమేల?

ఇంద్రు—దేవా! గిరిజావల్లభుం డనఁగనే జ్ఞప్తికివచ్చినది. చిరకాలముననుండి నన్నొక సందియంబు బాధించుచున్నయది. అద్ది యెద్దియనిన. హిమవద్రాజనందనా ధవుండగు నాశివునకు, సకలలోక వర్ధిష్ణుండగు నా మహావిష్ణునకును భేదమే మైనగలదా?

బృహ—సంక్రందనా! నీవెఱుఁగఁదలంచిన భేదము ఆకారంబుననా, వారిగుణాదులయందా?

ఇంద్రు—ఆ రెండువిషయంబులం గాదు. ఆ శేషశయన శేషభూషణులలో నేమహాత్ముండు భక్తజనసులభుఁడో, ఇద్దఱిలో ఘనులెవ్వరో, దైవశిఖామణి యెవ్వరో యెవని సేవించిన భక్తజనకీరవారంబునకు ముక్తిఫలంబు లభించునో యది చెప్పవలయును.

బృహ—మహేంద్రా! క్షీరసాగర విహారుండగునారాయణుం

డు, కైలాసవాసియగు నీశుండును, సమానులు. వారికి భేదంబులేదు. జనులు మూర్ఖులై కొందఱు శివుఁడే పరాత్పరుఁ డనియును అంతకంటె మూర్ఖులు విష్ణుఁడే పరాత్పరుఁ డనియును తమలోఁదాము వాదంబులఁ బడుచు వేదనం బొందుచుందురు. విభూతిధారులవదనంబులఁ జూచిన మహాపాతకంబని వైష్ణవులు, శ్రీమూర్ధ్నధారుల ముఖంబుఁ జూచిన దోషంబని శైవులును దలంచి నిర్హేతుకవిరోధంబుల సంపాదించి యంతంబులేని తమపంతంబులు నెఱవేర్పుటకై యింతింతనరాని దౌర్జన్యంబులఁగూడఁ జేయుచుందురు. నామరూపభేదంబులుగాని, హరిహరులకు మహిమలలో భేదంబులేదు. సకలభూషణ భూషితుండగు నారాయణుం డధికుం డనియు, శ్మశానములయందుండి నిర్ధనునివలెఁ గన్పట్టుచుండుటచే శంకరుం డల్పుం డనియు నెంచరాదు. అజ్ఞానాంధకారమునంబడి సంశుద్ధమార్గము నెఱుంగలేక సిలుగులం బడుమనుజులను హరిహరు లిరువురుం బ్రోవఁగలరు.

ఇంద్రుడు—ఆచార్యోత్తమా! ధన్యోస్మి! ధన్యోస్మి! చిరకాలమునుండి హృదయశల్యమగు సందేహము నివారితమయ్యె.

యము—దేవా! యజ్ఞ, చయన పౌండరీక కాశ్వమేధాది మహాధ్వరంబులు విధివిధానంబునం జేయుపుణ్యాత్ములకును, జగద్భీకర రణరంగంబుల మరణమునొందు పరాక్రమాభరణులకును పుణ్యంబును రంభాసంభోగంబును గలుగునని బ్రహ్మ విధించెఁగదా!

ఇంద్రు—అవును. అందునీకు సందియ మెద్ది?

యము—ఉన్న సందియమే యిచ్చట—

బృహ—సంశయం బున్నచో నది యవశ్యముఁ దెలిసికోనవలెను. అది యేదో చెప్పుఁడు.

యము—దేవా! కామక్రోధమోహలోభాద్యరిషడ్వర్గంబులం జయించి పరిశుద్ధాంతఃకరణముతో మెలంగుచు బంధముక్తుండగువాఁడు గదా స్వర్గంబునకు వచ్చుట; అట్టివానికి మరల సంసారంబు గల్పించి రంభాసంభోగంబు గలిగించుట న్యాయమా?

బృహ—యముఁడా! ఆవిషయము చెప్పెద వినుము. ఈరంభా

సంభోగంబు నాకంబునం గలసలకూబరాదుల కుండుటయుక్తమేగదా! దానికి నీవొప్పుకొనుచునే యున్నాఁడవు.

యము:—ఆఁ! దానికి నే నొప్పుకొనుచునే యున్నాను.

ఇంద్ర—(తనలో) నామనంబునఁ గలసంశయంబు నిదే. ఇతఁ డెట్లు దీర్చునో.

బృహ—సరే. విధ్యుక్తప్రకారంబుగా సత్వరంబుల నొనరించినవారును, యుద్ధంబుల మృతినొందినవారును బుణ్యాత్ములవుదురు.

యము—అవును. వారు పుణ్యాత్ములే.

బృహ—పుణ్యాత్ము లయినవారికి నంతంబున దేవత్వంబు లభించునుగదా! దేవత్వంబు లభించినవా రందఱు దేవతలేగద! దేవత లందరకు రంభాసంభోగము యుక్తమని నీవే వ్రాసితివిగదా? ఇందు చేత సోమయాజులును యుద్ధమరణులును దేవతలగుటచే రంభా సంభోగంబు యుక్తంబు. అవునా? గాదా?

యము—చిత్తము. ఆమాట నిశ్చయము. సంశయము లేదు. రంభాసంభోగంబువారికి యుక్తంబు. దేవగురువులగుటచేఁ జక్కఁగా తీర్చితిరి.

బృహ—అట్టి రంభాసంభోగాఖ్య మహాసౌఖ్యము గలుగునని యేర్పరుచుటచేతనే జనులు నిజధనప్రాణవ్యయంబులకు నైన నసరకు గొనక యుద్ధములఁ బోరాడివచ్చుచుందురు. వారు మనంబులలో నిజభక్తి లేకున్నను మరణానంతరంబున రంభాసంభోగ ప్రాప్తి యగునని యైనను యజ్ఞములను యుద్ధములను జేయుచుందురు. ఇట్లే బహ్మ లిఖింపక పోయినచో వారు యజ్ఞంబులను జేయరు. వీరు యుద్ధంబులను జేయరు. యజ్ఞనిర్వర్తనంబు లేనిచోఁ బ్రజలు [illegible] జేయనిచో జనరక్షణంబుగాదు. ఆరెండును జరుగుటకయి బ్రహ్మ యిట్లు విధించెను.

ఇంద్రు—అహాహా! ఆచార్యో[illegible]! ఈ[illegible] ప్రకటిత సందేహంబునకు మీయుత్త[illegible] బృ[illegible]తో[illegible], [illegible]హేతుక[illegible], యానందజనకంబై, శాస్త్రప్రమాణంబునకు, యుక్తిప్రమాణంబునకును సయితము నిల్చియున్నది.

(అప్పుడు ఒకరాజు ప్రవేశించుట.)

రాజు—(తనలో) నేను కాంభోజదేశాధీశుండ నగువిజయదత్తుండ ననియు, నేనొక మహాయుద్ధంబున మరణంబునొందితిననియు, నీయింద్రుఁ డెఱింగి, రంభాసంభోగార్థినై వచ్చిన నన్ను సబహుమానంబుగా నాదరించునా? లేదా? ఆఁ! అట్లేలయాదరింపకుండును (అని దగ్గఱకుఁ బోవుచు) మహేంద్రా! జయము జయము.

ఇంద్రుఁడు—నీరూపరేఖా విలాసంబులఁజూడ నీవొక క్షత్రియుని భంగిఁ గన్పట్టుచున్నావు. అందులో నీవు మరణంబునొందిన క్షత్రియుండవు. సకలజన వాంఛిత ప్రదాయకం బగునాకంబునకు వచ్చితివి. నీవాంఛితంబేమి?

రాజు—మహేంద్రా! నేను యవనదేశపాలుఁడగు నగ్నివర్మ భూపాలునిచే మహాసంగ్రామంబున సంహరింపఁబడితిని. అందుచే నిటకు—

యము—జృంభితదోస్తంభగంభీరుం డగు నీ కాంభోజరాజు రంభాసంభోగార్థియై శుభాకరంబగు నీయింద్రమందిరంబున కరుదెంచెను. అంతకంటెఁ బని యేముండును?

రాజు—దేవా! నిజముఁ బలికితిరి. నాయుద్యమం బిదియే.

బృహ—ఆకమలసంభవనిర్ణయప్రకారంబున నీమానవాధీశ్వరునకు నామానినీతిలకంబు నొడఁగూర్చుట యుక్తంబు. కాని యీసమయంబున నారంభ కుబేరకుమారుండగు నలకూబరునిసముఖంబుననుండుఁగాఁబోలు.

రాజు—దేవా! అక్షయలోకసుఖానుభవంబునకయి వచ్చినమా కాశాభంగంబు గలుగునట్లు లానలకూబరుండు రంభోరుస్తంభయగు నా రంభను దనకడ నుంచుకొనుట న్యాయంబె.

ఇంద్రు—అయ్యది వేగంబ రాఁగలదు శాంతింపుము.

యము—మూఢుఁడా! ఏదోనిరర్థకకల్పితయుద్ధంబున జచ్చితినని గర్వోక్తులు పలికెదవేల? పాపజన స్వర్గంబున దుర్గమంబున నివాసి, యుత్తర దిక్పాలక పుత్త్రుం డానలకూబరుం డాదరంబున రంభాసంభో

గంబుఁ జేయుటకు నీయాజ్ఞయా? వచ్చినవాఁడవువచ్చినదాకనుండుము.

ఇంద్రు—రాజా! నీయిష్టానుసారంబుగా సంభోగక్రియలం దని యుటకు రంభ నీ భార్యగాదు. మహాసంగ్రామనిహతులైన రాజన్యు లనేకు లామెసమక్షంబునకు వత్తురు.

బృహ—రాజా! సంసారంబను మహాంధకారమునుండి వెడలి మోహపాశ వినాశంబు గావించి మహేశుని వాసిగ నీమనోదేశంబున నివాసంబుంచి విరక్తుఁడవై సంభోగముల నుల్లఘించుటకుమాఱుగఁ దత్పరపడుచుంటివి. మోహార్ణవమగ్నుండవగు నీ కీస్వర్గలోకమ్మున సనర్హుం డవని తోఁచుచున్నయది.

రాజు—(తనలో) అయ్యో! ఇక్కడనుండి వీరు త్రోసివేయు దురా యేమి? ఆరంభాసంగమం బగువఱకు నూరకుండెద. ఆమె ఎట్లుండు నో? నేను భూలోకవేశ్యా సుందరుల నెందఱనో సందర్శించితి. ఈమం దయాన యేచందంబున నుండునో? అనంగ సంగరంబునఁ దదీయాలింగ నం బెంత యానంద మొసంగునో? ఆపల్లవాధర యధర సుధారసం బెంత మధురంబుగ నుండునో? అయినను నాలోచింప నేమి కార్యము.

ఇంద్రు—ధనాగారలాభంబు గల్గిన నిరుపేద బ్రాహ్మణునిచం దంబున, మందుండగు నీరాజనందనుఁ డమందానందపరవశం బగుచుండె ద ముఖో నున్నవాఁడు.

(అప్పుడు ఒకసోమయాజి ప్రవేశించుచున్నాఁడు.)

బ్రాహ్మ—(తనలో) నేనువిదర్భదేశంబున నివసించు నారా యణశర్మయను బ్రాహ్మణుండననియు, ననేకయజ్ఞంబుల విధ్యుక్తముగ నొనర్చుటచే రంభాసంభోగంబునకు వచ్చితిననియుఁ జెప్పెద (ప్రకాశ ముగా) మహేంద్రా! జయము జయము.

ఇంద్రు—బ్రాహ్మణోత్తమా! మీరాక యెచ్చటనుండి? ఏ మిఫలంబుఁగోరి యీత్రిదివంబును మీరాకచే నలంకరించితి.

బ్రాహ్మ—మహేంద్రా! నేవిదర్భదేశవాసుండనగు బ్రాహ్మ ణుండను. నే యజ్ఞము, బృహస్పతిసవనము, పౌండరీకము, చయనము, సర్వతోముఖము, వాజపేయము విధియుతంబుగ దానంబులతోఁ గూఁడ

జేసినాడను. ఆకారణంబున రంభాసంభోగమునకు వచ్చితిని.

రాజ—(తనలో) అయ్యో! నానోటఁ గరకాయ పడినది. పాపాత్ముండగు నీవిప్రునకు నగ్రజన్ముండను మిషచే రంభను ముందుగ నొసంగుదురు గాఁబోలును.

యము—సకలవేదాంతశాస్త్రమర్మజ్ఞుండవగు నీవును నీరాజు చందంబుననే, కామావేశముతో వచ్చితివిగా?

బ్రాహ్మ—మృతిబొందిననీరాజుగూడ నాకార్యమునకే వచ్చెగా?

రాజు—(కోపముతో) ఏమి! మఱేందుకు వచ్చితిననుకొంటివి?

బ్రాహ్మ—మహేంద్రా! ఈనరపాలధరణీసుర లేకకార్యార్థులై చనుదెంచుటచే నిర్వివాదంబుగ నీయంశంబు దీర్చవలయును.

రాజు—వివాదంబున కేమున్నది. ముందు నే వచ్చితి. ఆమె ముందు నన్ను సన్మానింపవలయును.

బ్రాహ్మ—అగ్రవంశజాతుండగు నే నుండగాఁ ద్వితీయవంశజుడవగు నిన్నామె యెట్లు మన్నించును? మే మా బ్రహ్మముఖమునుండి వచ్చినవారము.

రాజు—ముఖమునుండివచ్చినవారుగావుననేనీకుదొరకునదినీమొగము.

బ్రాహ్మ—క్షత్రియులయిన మీారు చేతులనుండి వచ్చితిరి గాన నీపని చేతులు నలుపుకొనుచు పోవుటయే.

రాజు—(కోపముతో) అనవసరప్రసంగములఁ జేసినచో శాత్రవహృదయసంతాపకరశీలంబగు కరవాలం బిదిగో!

బ్రాహ్మ—(కోపముతో)భవత్సమానరాజాధముల ముహూర్తమాత్రంబున గర్వనిర్వాపణంబుసేయు శాపాయుధం బిదిగో! మరియును కార్తవీర్యార్జునవంశసంజాతులగు రాజాధము లెందరు మాబ్రాహ్మణుండగుపరశురామునిచే విరామము నొందలేదు? జాగ్రత.

రాజు—ఓరీ బ్రాహ్మణా! ఘాతుకమృగచందంబున మనుష్య సంహరణ కాముండగు పరశురామునిగర్వంబు సర్వంబు మాక్షత్రియ వంశంబునం బుట్టిన జగదభిరాముండగు శ్రీరాముం డడంపలేదే. మారాజుల యింట్లలోఁ బురోహితుఁడవగు నీవిక్కడనేమేమో పేలెదవేమి?

బ్రాహ్మ—ఓరీ రాజాధమా! మంత్రిపాలకుం డగుబ్రాహ్మణుం డొకఁ డీయిందుడ్రని శపించె. అపార తపోధనుండగు మరియొకఁడు శూద్ర గర్భంబున జనియింపుమని యీయముని శపియించె. అగ్నిదిక్పాలక శ్రేష్ఠులే వంచింపఁబడుచుండ మనుష్యుండ వై మరణము నొందిన నీవెంత?

రాజు—నేనెంతో నాఖడ్గంబు తెలుపును. నీవెంతో నీ దర్భాసనము దెలుపుమనుము.

బ్రాహ్మ—దర్భాసనముగాదు. మంత్రపోక్తమగు నొక్క దర్భ చాలును. నీఖడ్గంబుల వంటివి దానిముందర దిగదుడుపులు పెట్టవలెను.

ఇంద్రు—బ్రాహ్మణోత్తమా! శాంతింపుము; రాజపుంగవా! యూరకుండుము. మరణాంతంబులఁ గామాతురత గలిసందుకు సిగ్గుపడక మహాకలహాసక్తులయి ప్రచండకోపోద్దీపితులై యిట్లు వివాదమాడ నేల? ఆవివాద మేను దీర్చెద.

బృహ—మహేంద్రా! ఆరంభను బిలిపించి ప్రథమమున నామె యెవరి నంగీకరించునో తదభిప్రాయ మరయుట యుక్తమంబు.

ఇంద్రు—అవును. ప్రతీహారుడా! ఆరంభను మదీయ సభామండపంబునకుఁ దోలుకొని రమ్ము.—

యము—(బృహస్పతితో) దానికంటె శాస్త్రోక్త ప్రకారంబుగా ఆపురుషుని మనమే యేర్పరచుట యుక్తమంబు.

బ్రాహ్మ—(తనలో) ఆరంభ యెట్లుండునో నిరంతరము రుసరుసలాడు మాసోమిదేవివలె నుండదుగదా! ఆమె యిల్లెక్కడనో, నే నీ స్వర్గలోకంబునకు వచ్చుచు మార్గంబున నామెగృహంబును జూచి యీ రాజాధముం డెరుఁగకుండ, నామెదగ్గఱకుఁ బోయి రావలసినది. అప్పుడు వాఁడేమిచేయునో; ఐనను బృహస్పతి నాపక్షముం బల్కుఁడా! మే మిద్దఱము బ్రాహ్మణులమేగదా!

బృహ—(ఆలోచించి) ఈస్వర్గలోకమునకు మొదటవచ్చిన వాఁడీ రాజసుతుండు. కాని అగ్రికులమున బుట్టినవాఁ డీవిప్రుడు. ఒక్కొక్క కారణంబున నొక్కొక్క రధికులయి యున్నారు. ఎట్లయినను అగ్రవంశ

సంజాతుఁ డగుటచే నాబ్రాహ్మణున కీసరసీజాతనేత్రను మొదట నిచ్చుట యుచితము.

రాజు——(విచారముతో) ఓదేవగురూ! యీస్వర్గలోకంబునకు మొదటవచ్చిన వాఁడను నేనుగదా! నేను వచ్చుటతోడనే ఆయిందీవర దళనేత్ర యిచ్చటనుండినచో నాకామె చేకూరునుగదా! అట్లుగాక నల కూబరసమక్షమున నుండెనని మీరాటంకపరిచితిరి. ఆలోపంబు మీదా? నాదా? అయినను యీవఱకు జాతియే ముఖ్యముగఁ జూచుటలేదు. ఎట్లనిన ప్రపంచారంభముగాఁ బెక్కువత్సరములనుండి మ్లేచ్ఛ, కిరాత, పార్వతీయాదిహీనజాతులవారు సయితము, రణరంగ నిహతులయి యీ బ్రాహ్మణునికంటె ముందు రంభను, గూడిరా? లేదా? అక్కడ జాతి ఏది? తరువాత నీమూర్ఖుఁ డామె నంగీకరించునా? లేదా?

బ్రాహ్మ—— వెనుక జరిగిన వృత్తాంతముల సంగతి యెందుకు? ప్రస్తుతాంశ విచారణము చేయవలయురు.

బృహ—— మహేంద్రా! అత్యంత ధర్మసూక్ష్మ సమేతం బగు నీయంశంబున నాకేమియుఁ దోఁచకున్నది.

ఇంద్రు—— అందుకే నేనును దీర్ఘాలోచన సేయుచున్నాఁడను. అస్మదాచార్యులగు మీకే తోచనప్పుడు మీ శిష్యుఁడనగు నాకా తోఁచుట?

యము——మీయాజ్ఞనిని రంభ యిదే వచ్చుచున్నది.

(అప్పుడు రంభ వచ్చుచున్నది.)

రంభ——(తనలో) నలకూబరుసమక్షంబుననున్న నన్నా యింద్రు డత్యంతావశ్యకముండిన గాని పిలిపింపఁడు. అదియేమో కనుఁగొన వలయు (ప్రకాశముగా)మహేంద్రా! విజయమగుగాక! విజయమగుగాక!

బ్రాహ్మ——(లేచితనలో) ఇంద్రసభామంటపమున కరుగుచున్న యీ రంభకు నే నెదురుగాఁ బోయెదను. (అనియెదురుగా బోయి) కాంతా! రంభవు నీవేనా?

రంభ——(వినిపించుకొనక ఇంద్రునిదగ్గఱకుఁ బోవుచున్నది.)

ఇంద్రు—— ఓనాకలోక వేశ్యకాంతాలలామా! ఈ రాజపుంగవ

బ్రాహ్మణోత్తములు భవన్నిమిత్తము వచ్చియున్నారు. వారికి నీయభీష్టము లొసగి తనుపుము.

రంభ—ముఖము ముడుతలుపడి శల్యాచర్మావశిష్టుఁడయిన యీ శిష్టబ్రాహ్మణునికిఁగూడ కామాపేక్షయే? కాలిపోయినచెట్టు మరలఁ జిగురుచునుఁ గాబోలును?

బ్రాహ్మ—న న్నీ వేశ్యాకాంత నిందాస్పదముగాఁ జూచుచున్నది. ఎట్లయినను ఇది నన్నొల్లక తప్పదు. ఓసీ రంభా! తాంబూలమియ్యవే?

రాజు—(తనలో) ముం దీపాపాత్మునకే తాంబూల మొసఁగు నాయేమి?

రంభ— సోమయాజులవారూ! భవజ్జన్మ కాలమధ్యంబున నెన్నఁడైన తాంబూలము గనుగొంటిరా లేక విన్నారా? మరియును మీరు వేదాధ్యయనపరులు పరమఛాందసులు అదిగాక "వైదికుని చేతి విడెమూయె వనితబ్రతుకు" అని లోకోక్తిగలదు! దానినిబట్టి తాంబూలోపయోగంబును, దాని లక్షణంబులును, తద్రుచియు, దాని శృంగారంబును మీ రెరుంగరు.

బ్రాహ్మ—(కోపముతో) వేదవేదాంగ పారంగతుడనయిన నే నెరుంగనిచో నీరాజాధముం డెరుంగునాయేమి?

రాజు—నాప్రశంస నీకేటికి? నీవిషయమై నీవు చెప్పుకొనుము. (తనలో) నాకడ్డువచ్చిన యీధరామరాధముని, యీరంభ చేరనియ్యదని తోఁచుచున్నది. (ప్రకాశముగ) రంభా! నావిషయమయియేమిచెప్పితిని.

రంభ—రాజా! రంభాసంభోగార్థమయినీవు రావలెనని వచ్చినట్లు తోఁచుచుయున్నది. బ్రాహ్మణోత్తముని బెదరించుటయ్యెసదా?

రాజు—ఆబ్రాహ్మణబ్రువుని నేను బెదరించెదునదేమి?

బ్రాహ్మ—నీవుమాత్రము క్షత్రియపుత్రుడవుగావా? అధమా! పేలకుము.

రంభ—(తనలో) ఈసమయంబున వీర లన్యోన్యనిర్మూలనము చేసికొనినచో వివాదము పరిపూర్తియగును.

యము—(కోపముతో) ఓమహేంద్రా! ఓఆచార్యా! అత్యధిక

రోషభీషణాకారులయి దూషణభూషణంబులచే నన్యోన్యగంఠశోషణంబు చేయుచున్నయీ వేషధారులవివాదంబులను నేనిమిషమాత్రంబున తీర్చెద.

ఇంద్రు——ముఖ్యముగాఁ జేయవలసినదే.

బృహ——ధర్మాధర్మవివేచన సామర్థ్యముగల నీకిది యొకకష్టముగాదు.

యము——ఓయి బ్రాహ్మణా! ఓయిరాజా! మీరు భూమండలంబున జీవితులయి యున్నకాలంబున నేయేయవసరంబున నేయేధర్మకార్యాచరణంబొనరించి పుణ్యసంపాదనంబు చేసితిరో; యేయేధర్మకార్యావలంబనులయి దోషసంపాదన మొనరించితిరో యీవఱకును విచారింపలేదు. అందుచే మీరుఁ బరమాప్తుఁ డగుచిత్రగుప్తుని సముఖంబున కరిగి పాపలేశంబుండినఁ దన్నియమితనరలోకబాధ లనువిభవించి తదనంతరం బిచ్చటికి రండు.

ఇంద్రు——యముడా! చక్కని తెర వూహించితివి. వేగమే పోయి రండు.

బ్రాహ్మ——[తనలో] అయ్యో! రంభాసంభోగప్రాప్తియగునని ధనవ్యయము చేసితిని. లేకున్న-చోఁ జేయకపోదునే.

రాజు——(తనలో) రంభా సంభోగప్రాప్తియగునని యుద్ధంబున నిర్హేతుకముగాఁ జచ్చితిని. లేకున్న బ్రతికియుందునే! ఉభయభ్రష్టత్వమయినది. (అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

బృహ——ఇట్లు ధర్మసూక్ష్మవిచారణ సేయునపుడు సకలలోకవర్ధిష్ణుఁడగు శ్రీకృష్ణుఁ డత్యంతచాతుర్యగాంభీర్యంబుల మెలంగుచుండునని వినుచుంటిమి. అట్టి బుద్ధిరత్నాకరుఁడే యిట్టిది తీర్పవలయు.

ఇంద్రు——ఇందిరామనోహరుఁ డగు నయ్యరవిందనాభుఁ డీసమయంబున నిందుండిన బాగుండును.

(అప్పుడు శ్రీకృష్ణుండు, సత్యభామయు, ప్రవేశించుచున్నారు.)

కృష్ణు——దేవీ! వామనావతారసమయమున మాజననీజనకులగు నదితికశ్యపులను, వరుణ, కుబేర, పావక, నిరృతీశాన, వాయువులను, సందర్శించితిమి గదా! ఇదిగో నచ్చట యమ బృహస్పతి సమేతుఁడై సహస్రాదనుఁడు గొలువుదీర్చి యున్నవాఁడు.

సత్యా—ప్రాణేశ్వరా! నవరత్నఖచిత సింహాసనాసీనుఁడై కాంచన కిరీటశోభితుఁడై యాయుధము ధరించిన యామహానుభావుఁ డెవడు.

కృ—ఉ. ఆతఁడె ప్రాగ్దిశాధిపతి యాతఁడె నిర్జరలోకనాయకుం
డాతఁడె ముజ్జగంబుల మహావిభవంబున నేలుమేటి సు
మ్మాతఁడె కొండరెక్కల నిజాయుధధారలఁ దున్మధీరుఁడా
నాతఁడె వందనీయుఁడగు నంబుజలోచన! నీకు నాకునున్.

సత్యా—సరే! ఆమహేంద్రుని దక్షిణభాగంబున అంజనశ్యామలాకారుఁడై దండంబు ధరించిన యాతఁ డెవ్వరు?

కృష్ణు—చ. అతఁడుమహానుభావుఁడగుపట్టియముండు, దినేంద్రసూతియు
ప్రతిముఁడు ధర్మశాస్త్రము లపారముఁ జూచినవాఁడుపాపసం
గతులగు దుష్టచిత్తులను నారక కూపములందుఁ ద్రోసిబల్
వెతలనుబెట్టు నీఘనుని పేర్వినిసన్ జగముల్ వడంకెదున్.

సత్యా—సరె. ఆమహేంద్రుని వామభాగంబునఁ గూర్చున్న యాముదుకఁ డెవ్వరు?

కృష్ణు—చ. ముదుకఁడెగాని యత్యనఘమూర్తి సుపర్వగురుండు నీతిసం
పద నితఁ డద్వితీయుఁడని పద్మభవాదులు మెచ్చుచుందు రా
త్రిదశవిభుండు దక్కఁగల దివ్యులు నీతనియాన మాళి దా
ల్చెద రిన వీనిసన్మహిమఁ జెప్పగనేటికి నెర సుందరీ!

సత్యా—నాథా! వారిసన్నిధినున్న యాబోఁటిమిన్న యెవరు?

కృష్ణు—అదియె రంభా స్తంభోరువగు రంభ.నాకలోకవేశ్యకాంత.

సత్యా—జితేంద్రియులగు దేవతాశ్రేష్ఠులకుఁగూడ వేశ్యాకాంతలు గావలెనా?

కృష్ణు—వారికే నరులకంటె నధిక కామంబులు భోగంబులు కావలెను.

రంభ—దేవా! సత్యాభామాసమేతుఁడై శ్రీకృష్ణుడు భవద్దర్శనార్థమై వచ్చుచున్నవాఁడు.

ఇంద్రు—(అదరిపడి) ఏమీ! లావణ్యసీమయగు సత్యాభామయు సకలభువనవంద్యుఁడగు నాకృష్ణుఁడును నాదర్శనార్థమై వచ్చిరా? ధన్యోస్మి

ధన్యోస్మి. ఓ ఆచార్యోత్తమా! ఓయముఁడా! మన మాయాదవేంద్రు నెదుర్కొందము రండు.

బృహ—ముఖ్యముగా నట్లు చేయవలసినదే!

యముఁడు—సకల భూతాంతర్యామియు కేవల మాయామయాకారుఁడగు నామాధవుండు మన కడకరుదేర మన మెదుర్కొనుటయెంతపని?

అప్పుడు కృష్ణుఁడు సత్యభామయు దగ్గరకు వచ్చుచున్నారు.

(ఇంద్రాదు లెదుర్కొనుచున్నారు.)

కృ— దేవా! సక్రిందనా. ఓనిర్జరాచార్యా! ఓదండధరా! మువ్వురకుఁ బ్రణమిల్లుచున్నాఁడను.

బృహ—ఈప్సితార్థ సిద్ధిరస్తు.

ఇంద్రు—దేవా! మాధవా! మాకును శంకరపంకజనాభులకును వందనీయుండవగు నీవు మాకు నమస్కరించుట భావ్యంబే?

కృ— ఓత్రిలోకాధినాథా! నేను శ్రీవామనావతారధారి నైనప్పుడు నాకగ్రసహోదరుండవగు నీవును నాకాలంబున సకల నీతిశాస్త్రంబులం గఱపుటచే గురుండు గావున నీబృహస్పతియు నయ్యవసరంబున నఖిల ధర్మాధర్మ విచారణ సామర్థ్యం బొసంగుటచే నీయముండును నాకు వందనీయులు. కాని దిక్పాలకాచార్య సమేతంబుగా నీకు సేమంబే గదా!

ఇంద్రు—దేవా! అమర రక్షణమునకుఁ గంకణముఁ గట్టుకొని నీవుండ సేమమునకు లోపమేమి? ఆపీఠంబులఁ గూర్చుందము రమ్ము. అమ్మా సత్యభామా! నీవుఁగూడ రమ్ము. (అందరుకూర్చున్నతరువాత)

యము—దేవా! శ్రీమన్నారాయణా! ఆదికాలంబున క్షీరపారావార విహారపరాయణుండవై సకలలోకసౌఖ్యదాయకుండవయి వటపత్రశాయివై యోగనిద్రాసక్తచిత్తుండవై రమాపంకజ గంధిసమన్వితుండవై యుండి సకలనిర్జరగణప్రార్థితుండవైజగత్సంబాధకరదనుజలోకదారణకేళీలోలుడవై శ్రీవత్సాఖ్యమంగళలాంఛనంబుతోడను దేదీప్యమానప్రభాసమన్వితకౌస్తుభమాణిక్య తల్లజంబుతోడను నిజఘోషణమాత్ర సంహృతదానవమండలం బగు పాంచజన్యంబుతోడను నవక్రవిక్రమంబగు సుదర్శనచక్రంబుతోడను నిజఘాతచూర్ణిత దానవప్రశస్తమస్తకంబగు కౌమో

దకిగదా దండంబులతోడను ఆత్మీయజ్యానాదబధిరితకకుబంతదంతావళం బగు శార్ఙ్గంబుతోడను శ్రీమద్దేవగర్భదుగ్ధపయోధిచంద్రుడవై అపరిమిత కరుణారససాంద్రుండవై యాదవేంద్రుడవై జనియించి జరాసంధ శిశుపాలదంతవక్త్రాది రాక్షసాంశ సంభూతుల వధియించితివి. శిష్టజనపాలన దుష్టసంశిక్షల చేయుచుంటివి. నీమహామహిమంబు నెన్న నెవరితరంబు గాదు. నాకు శక్యంబె?

కృ—ఓయమ్మా! నీకుమాయం దపరమిత ప్రేమగలదు. ఓసత్యభామా! యీకాలుండు మనకు పరమాప్తుండుసుమా!

సత్య—దేవా! మహానుభావులగు దేవరవారికి నాప్తులుగాని వారెవ్వరు? త్రిలోకపూజ్యులయిన యీదిక్పాలకాదులచే బూజింపఁబడుచున్న మీరెంతవారని నే నూహింతును. మామధ్యంబున మనుష్యమాత్రులవలె సంచరించుటచే మీమహిమ గ్రహింపలేము.

బృహ—అమ్మా! నీవు చెప్పినదంతయు నిశ్చయము. (యింద్రునితో) మహేంద్రా! ఈమహానుభావునే నెవ్వనిగాభావించుచుంటివి, చూడు.

సీ. భువనముల్ పదునాల్గు బొజ్జనిల్పినవాఁడు
యోగుల మదులందు నుండువాఁడు
విరిదమ్మి మొలచిన వెడఁద పొక్కిలివాఁడు
కడుపార నలువను గన్నవాఁడు
కారుమబ్బులగేరు కరిమేని జిగివాఁడు
కాలభేదముఁ దెల్పుకనులవాఁడు
నదితిగర్భమునందు నవతరించినవాఁడు
తెఱగంటులను నేలు దీక్షవాఁడు
నెచటనున్నను తెలిదీవి యిల్లువాఁడు
విశ్వమున కెల్ల రక్షయౌ విల్లువాఁడు
నమృతవార్ధికి గారాబుటిల్లువాఁడు
మత్తుచాణూరుజంపిన మల్లువాఁడు.

బృహ.—మరియు నీమహానుభావుండాదిమధ్యాంతరహితుండును గుణరహితుండును, కేవల తేజోమయమాయాకారుండును, జననభరణ మరణహేతుభూతుండు నైయున్నవాఁడు. ఓమహేంద్రా! యేమహానుభావుంకనుగొనుటకయి జ్ఞానులధ్యాత్మవిద్యాభ్యాసంబు చేయుదురో యేలోకపూజ్యునిఁ జూచుటకై జపతపస్స్వాధ్యాయంబులు పుణ్యమంత్రోచ్చారణంబులు యజ్ఞంబులు దానంబులు పుణ్యకర్మంబులు గంగాది పుణ్యనదీస్నానంబులు పుణ్యస్థల సందర్శనంబును సకల దేవతాసేవనంబును. సేయుచుందురో యెవని తేజోమాయాకార సందర్శనంబుచేసిన అనంతపదము చేకూఱునో అట్టిచరాచరాత్మరుండును బరాత్పరుండును జ్ఞానమయుండును మనకు ప్రసన్నుండయ్యె. అందుచే జన్మము పావనంబయ్యె. ఈనాకలోకంబు వన్నెకెక్కె.

ఇంద్ర.—అవును. ఈయిందిరామనోహరుండు!

ఉ. బాలురలోన బాలుఁడయి పాడుచు నాడుచు నుండు వేడ్కతో
నాలమునందు వీరుఁ డయి యంతముఁ జేయును శత్రువర్గమున్
తాలిమి కన్యకామణుల దగ్గఱఁ దా, రసికాగ్రగణ్యుఁడై
లీలల నెన్నఁగా దరమె లేఖకు లందఱు లెంచఁజూచినన్?

(కృష్ణునివంకఁదిరిగి) ఓమాధవా!

చ. అలబలిదాడి కోడి యమరావళి విప్రుల మంది పాఱవే
ల్పులఁ గరుణింప నయ్యదితిపొత్తులబిడ్డఁడవై జనించి యో
వలినదలేక్షణా పెటిఁగినాఁడవు మాగృహమంముఁ గ్రమ్మఱన్
జెలిమిని మాగృహంబునకె చేరితి వుండుము కొన్ని నాళ్ళటన్.

కృ.—మహేంద్రా! నీవు నన్నింత సంభావింపవలసిన పనిలేదు. ఏలయన

ఉ. ఎవ్వనియూరునన్ పశువులేనియుదానము లీయనేర్చునో
యెవ్వనిపీట వారసతులేనియు యాగఫలంబు లిత్తురో

ఎవ్వఁడు దాల్పఁగా నెముక యేనియు నజ్రిపుతుంన్కయానో నేఁ డవ్విబుధేంద్రుఁ గంటిమి పురాకృత మహాసుకృతంబు పెంపునన్.

ఇంద్రు—యాదవేంద్రా! నీవు మమ్ము ధన్యులఁ జేయవచ్చిన కారణమేమి?

కృ—సంక్రందనా!

ఆ. వె. నాకమునకు వచ్చి నరకాసురుఁడు తొల్లి
యమరకోటి గన్నఁ యదితిదేవి
కుండలముల నెత్తుకొనిపోయె నవి యిప్డు
తెచ్చినాఁడ దల్లి కిచ్చుకొఱకు.

బృహ—నరకాసురుఁడు సంహరింపఁబడియెనా?

కృ—మీయనుగ్రహముచేత

ఇంద్రు—అమరకోటి కమితోపకార మొనర్చితిరి.

యము—ఇది మొదటిసారిగాదు.

సత్య—ఈమహాత్ముని రాకకు నా ప్రేరణముఁగూడ కొండొక కారణమయి యున్నయది.

కృ—అవును; ఈనాకనదీమతల్లిని, మీనందనవనమును, శచీదేవిని సందర్శింపఁగోరి సత్యభామ నన్నీలోకమునకుఁ బయనముఁ జేసినది.

ఇంద్రు—ఏకారణమున నయిన నేమి; యీమహాత్ముని రాకచే నాకనులుపండువొనర్చె. మీయభీష్టము నిర్విఘ్నముగా నెఱవేఱుఁ గాక!

బృహ—దేవా! ఇంద్రమందిరంబున కరిగి పూజ్యులగు నదితి కశ్యపులఁ జూతమురండు.

కృ—మన్నింపఁదగిన గురుజనబంధుగణంబుల నందఱ నిదివ ఱకే సందర్శించితి.

ఇంద్రు—అట్లయినఁ దక్కువిశేషంబులం జూతమురండు.

సత్య—ప్రాణేశ్వరా! నాకలోక వేశ్యకాంతయగునీరంభనృత్య గానంబులయందు నెఱజాణయని విందును. అందుచే నీమెనృత్యగానం బులు కనివినవలయు.

ఇంద్రా—అమ్మా దానికేమిభాగ్యము, ఓసీరంభా! నీనాట్యము, గానము ధన్యత నొందుకాలము వచ్చినది. ఈమహాత్ముల మెప్పింపుము.

రంభ—మీరామాత్రపుమాట నందురాయని కనిపెట్టుకొనియు న్నాను. ఇట్టి మహారసికులు చూచి మెచ్చనియెడ నావిద్య యెందుకు? ఇదె యారంభించుచున్నాను. (అని యాడుచున్నది)

కృ—(ఆట అయినతర్వాత) యెన్నఁడును గని విని యెఱుఁగని నృత్యగానవినోదంబులు స్వర్గలోకవాస్తవ్యులగు మీకుఁ భూలోక వస్తువులయం దిష్టముండదు. కాని యీహారము నీవు బహుమాన ముగాఁగై కొనుము. (అని రంభకిచ్చుచున్నాఁడు)

సత్య.—నీవిద్యావైభవంబులకుఁ దగిన బహుమానము గాకు న్నను దీనినిఁగూడఁ గైకొనుము. [రంభకిచ్చుచున్నది.]

రంభ—ఈబహుమానంబులు శిరసావహింపఁదగినవి. ఏలయన మీరిచ్చుటచేత.

కృ—మహేంద్రా! నందనవనంబు సందర్శింతము రమ్ము. యముఁడా! కొలువు చాలింతమా! ఆచార్యోత్తమా! సెలవొసంగెదరా! దేవీ? పోవుదమా!

అందఱు—చిత్తము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]



శ్రీ

# పారిజాతాపహరణము



## పంచమాంకము

[ప్రదేశము—నందనవనము.]

[అప్పుడు శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృ—దేవీ! సర్వసౌఖ్యాకరం బగునీనాకలోకమున నిన్నటి రాత్రియంతము నపూర్వసుఖనిద్ర లభించినది. ఎందుచేతను,

తే. గీ. దేవతోద్యానవనమందు దిరిగి తిరిగి
కలఁగి మిన్నేటితరఁగల గలసి మెలసి
మలయమారుతుఁ డరుదెంచి మందగతుల
మెల్ల జోకొట్టినట్టు నామేను సోఁకె.

ఇట్టియానందము భూలోకదుర్లభముగదా!

సత్య—అవు నది నిశ్చయమే. కాని యిప్పుడు మన మున్నదే ప్రదేశము?

కృ—దేవీ! ఈప్రదేశముచెప్పనక్కఱలేకయే తెలిసికొనఁదగినది.

ఉ. నందన మీవనం బదితినందనసేవ్యమునిర్జరేశ్వరుం
డిందు శచీసమేతుఁడయి యెల్లప్పుడున్ విహరించు నిందెయీ
చందనపారిజాతముఖసారకుజంబులు నిల్చియుండు దై
నందిన వైభవం బమరనాథునకున్ సమకూర్చు నెప్పుడున్.

సత్య—అట్లయిన సత్వరమాపారిజాతమహీరుహముకడకుఁబోవుదము రండు.

కృ—దేవీ! ముహూర్తమాత్ర మీయమరలోకనందనవన వైచిత్ర్యంబులఁ జూచి యనంతరము పారిజాతముకడ కరిగెదము. ఇందు మందారహరిచందనసంతానాదిదేవ భూరుహకుసుమసౌరభంబును సరో

వరారవింద మకరంద పానేందిందీవరఝంకారంబులును ఘ్రాణేంద్రి యంబునకును గర్ణద్వయంబునకును నేత్రయుగంబునకును నొకపర్యా యమే విందొనరించుచున్నది.

సత్యా—ఈవనరామణీయకము నీతరువుల సొబగు నెంతచూచి నను దనివి దీఱకున్నయది.

కృ—సుందరీ! అందుచేతనే నిర్జరులు దీనికంతగాఁ గూర్తురు.

తే. గీ. అవనిజంబులు పూచు దోహదములేక
యాఱుఋతువులఁ బువ్వులుండును నన్నిచెట్ల
వేలుపులు వోలె నిందలివృక్షములును
ముదిమియును జావులేకుండ పొదలుచుండు.

సత్యా—దేవా! మీప్రసాదమున నాకిట్టివైచిత్ర్యములఁ జూచు భాగ్యము లభించినది. నాతొందరను క్షమించి నన్ను సత్వరము దివిజ భూరుహముకడకుఁ గొంపొండు.

కృ—దేవీ! అట్లేచేయుదును. (అని కొంతినడిచి) ఇదిగో! కల్ప వృక్షవాటియొద్దకు వచ్చినారము.

సత్యా—దేవా! భూలోకమహీరుహములకంటె నెంతయును సుం దరమైదర్శనీయమయి యున్న యావృక్షరాజము పేరేమి?

కృ—సుందరీ!

క. కల్పము నందనమున కా
కల్పము సఫలీకృతసురగణమానస సం
కల్పము వెలసెడు నిది బహు
కల్పంబులనుండి నిర్వికల్పంబగుచున్

సత్యా—నాజీవిత మింతకాలమునకుఁ జరితార్థత నొందినది. త క్కినమార్పులఁగూడ నెఱిఁగింపుడు.

కృ—ఎఱిఁగించుచున్నాఁడ వినుము.

మ. అది బృందారకసుందరీనిరతసేవ్యం బైనమందార మ
య్యది సంతానకుజంబుఁ దత్తరుపుచ్ఛాయం దేవసంతానముల్
మదినానంద మెలర్ప నిల్చెదును లేమాచూడు మా ప్రాకుప్ర

కృ—దె సుమ్మా హరిచందనం బిదియె సింగారం బిడుందోటకుణ్.

సత్య—(నవ్వుచు) నాలుగుమాత్రికుల నామములు మాత్రమే నాకెఱిగించి యెదవదానిం దలపెట్టరేమి?

కృ—కళ్యాణీ! నీహృదయంబున గలతొందరచే నీ వట్లనుచుంటివి గాని నేను క్రమక్రమంబున నెఱిగించుచునే యున్నాను విను.

మ. నెలఁతా! యస్మ్యాదియే విదర్భసుతకు న్నీకున్ మనస్పరలన్
గలుగంజేసినపారిజాతము స్వరాట్కళ్యాణ సంవరకం
బలభిచ్ఛ్రీయుత మాలతాంతములె సా ... బంతి... హే... మై
వలపు ల్జిమ్ముచు నిండుమోదమిడు నాపౌలోమి ప్రశాంతిమున్.

సత్య—(తొందరతో)పది నామనోరథంబును, నాకుమోదంబు ను, నాకును విదర్భరాజనందకును గలహాకారణంబగు మహీరుహంబు.

కృ—అదిగో (అని వగలఱకుంబోయి) నారదముని ద పారిజాత పుష్పంబొక్కటి దొరకుటయే దుర్ఘటం బయ్యెను. ఇప్పుడు నీమనోరథ సాఫల్యం బగునట్లు కావలసినన్ని బుష్పంబుల ముడుచుకొనుము.

సత్య—దేవా! నామనోరథం బట్లు సఫలముగాదు. ఈవృక్షము మదీయ మందిరోద్యానవనంబునకుఁ దీసికొని పోవలయును.

కృ—(తనలో) ఈమెతో నిప్పుడు పరిహాసంబు గావించెద. (ప్రకాశముగా) అబ్బా! ఈమహీరుహంబు నేమి? నేనేమి? తెచ్చుట యేమి? దీనినిఁ గొంపోవుటకు నాదేవేంద్రుని యనుజ్ఞ వేడవలయు. అట్లు చేయుదుమా?

సత్య—(సంతోషముగా) వేఁడినచో సమిపౌసౌఖ్య దాయకంబగు దీనిని నాతఁ డిచ్చునా?

కృ—ఇయ్యఁడు! ఆమాట నిజము. అందుకేమి చేయఁగలము? పోనీ నుమనోరథసిద్ధియగునట్లు కావలసినన్ని నీతురుముసందురుకొనుము.

సత్య—అంతమాత్రమున నామనోరథసిద్ధి పూర్తిగాఁ దీరదని యేగదా! పోనిండు. ఆదేవేంద్రు ననుజ్ఞఁ బొందనేల? అతఁ డెఱుంగకుండ రహస్యముగాఁ దీసికొనిపోవుదము.

కృ—(ఆశ్చర్యము నభినయించి) ఏమి? దొంగతనము జేయుమని యెదవా? ప్రాణేశ్వరుండు దురాచార వర్తనుండైనపుడు కులకాంత తన మధురనీతి వాక్యంబులచే నది మాన్పవలె. అట్లు చేయుటకు మారుగా నీచమగు చౌర్యమునకుఁ బురికొల్పుచుంటివి. ఇది నీకు భావ్యమా?

సత్యా—(నవ్వుచు) ఏమి? మీనంగనాచితనము; దొంగతనం బెరుఁగనివానివలె నభినయించుచుంటిరి. బాల్యకాలమున గోపికా గృహంబుల దధి క్షీర నవనీతంబుల దొంగిలించుట మీకలవాటేగాదు. దొంగతనము మున్నును, తరువాత మీరును బుట్టితిరి.

కృ—బాల్యావస్థల నెన్ని చేసినను జెల్లును. పూర్ణయౌవన ప్రాయంబువచ్చినప్పు డాగట్టవచేఁతలు చెల్లునా? పోనీ, భవత్కార్యనిర్వాహణంబునకై దొంగతనమున కంగీకరింత మన్నను త్రిజగద్భీకర పరాక్రమ సాంద్రుఁడగు నాదేవేంద్రుఁడు మనలఁ బట్టికొనునుగదా! నే నందుకే జడియుచున్నాఁడను.

సత్య—(విచారముతో) దేవా! చక్రాయుధశోభిత ప్రశస్తహస్తులగు దేవరవారి పరాక్రమమునుముందర దేవేంద్రుఁ డెంత? మీరిట్లు పరిహాసార్థమె నన్ననవలసి యనెదరుగాని నే నెరుగనా? అదియుగాక నాఁడు నాతో మీరిట్లనలేదా? "అయమరలోకంబున కరిగి సమీర, సమవర్తి, సముద్రేశ, సర్వభక్షాదులగు దిక్పాలకులం గూర్చుకొని యాదేవేంద్రు డడ్డమువచ్చినను వచ్చుఁగాక!

ఉ. మానవతీవిభూష విను మాట లిఁకేటికి నీవుమెచ్చ యనా
నా నన నాశచీరమణి యచ్చెరువంద వడంక ముజ్జగం
బే నమరావతీపురికి నేగి చొరంబడి యింద్రనందనో
ద్యానము పారిజాతవసుధారుహము న్గొని తెచ్చి యిచ్చెదన్.

కృ—(నవ్వుచు) నాపరాక్రమమునకు నీవే మెచ్చుకొనవలయును. ఆడుదాని యెడమకాలిచేఁ ద్రోయబడినవానికి పరాక్రమ మెట్లుండును?

సత్య—(తలవంచి) ప్రాణేశ్వరా! క్షమింపుఁడు.

కృ—దేవీ! క్షమార్పణ కేమున్నది? అదిగాక యారంభకాలమున బ్రజ్ఞలఁ జేయుట సుకరము! నెరవేర్చుట దుష్కరము. తెచ్చెద

ననఁగా నిరపాయమయిన యుపాయము గల్గినఁ దెచ్చెదనంటిని గాని వీలు దప్పినచో నేమి చేయుదును?

సత్య—(కన్నీళ్ళతో) ఈఆటంకముల నప్పుడే చెప్పకపోతిరా? రాకుందునే? అప్పుడు నిరర్థకప్రతిజ్ఞలఁ జేయనేల?

కృ—అయ్యో! విచారించిన నేమి కార్యము?

సత్య—విచారముకాక యీసత్యభామ ముఖమునకు నానంద మెప్పుడు?

కృ—అందుచే నీమహోత్సవపరిపూర్తి యగునట్లును నాకునిర్బాధక మగునట్లును నొకయుపాయముఁ జెప్పెద నది యెద్దియనిన యీ పారిజాతమహీరుహంబు నిందేయుంచి యనుదినమును శతసహస్ర పుష్పంబుల నీకుఁ దెచ్చునట్లు గరుత్మంతున కానతిడెను. అది సమ్మతమా?

సత్య—(శృంగారసముచితంబుగ నేడ్చుచు) ప్రాణేశ్వరా! యిది మీకుయుక్తమా? అట్లు పారిజాతవృక్షమును దెచ్చి మదీయ బృందావనంబు పెరటిచెట్టుగా నాటింతునని చెప్పలేదా? యిప్పు డిట్లననేల? పారిజాతమహీరుహంబు దెచ్చుకొందునని రుక్మిణి, జాంబవతి, మిత్రవింద, కాళింద్యాదులతో బీరములుపల్కి వారిసధిక్షేపించి వచ్చితిని. అప్పుడట్టి యట్టహాసంబుచేసి యిప్పుడు దీని దీసికొనక రిక్తహస్తములతోఁ బోయిన నాసవతులు నన్నవమానింపరా? ఆయవమానము నే భరింప గలనా? ఈవృత్తాంతము నాకు ద్వారకానగరంబుననే మీరు దెల్పినచో రాకుండ నొకమారచ్చటనే వగచి యూరకొందునుగదా!

కృ—ఒకపర్యాయము శిక్షించితివి గాన మఱల యథాపూర్వకముగాఁ జేయుదు వన్నభయముచేత నట్లంటిని.

సత్య—(ఏడ్చుచు) జీవితేశ్వరా! మీపరిహాస వచనముల నడచి నాకు దలచిన మహాపరాభవసముద్రమునుండి దాటించిరుక్మిణితో సమానముగఁ జేయుడు.

కృ—[ తనలో ] ఈకాంతారత్న మింతదనుక రుక్మిణికంటెఁ దన్నధికగా జేయుమనివేడి యీసమయమున రుక్మిణితో సమానముగ నుండి

నచాలుననుచున్నది. కాని స్త్రీసామాన్యంబునకు దుఃఖము నిశ్శేతుకముగ వచ్చును. పాపము నాకుజాలియగుచున్నది. దీనినూరడింతు. [ప్రకాశముగ]

తే. గీ. ఆణిముత్యాల చేరుల నవఘళించు
తేటకన్నీటిసోనలు తెలుపియిడక
యెడదఁ దళుకొత్తుజిలుగుపయ్యెదను దడుప
నేలవగచెద వెలనాఁగ బేలవగుచు?

దేవీ! యూరడిల్లుము; పారిజాతము దెచ్చెదను.

సత్య—దేవా! నాపై నిజముగా ననుగ్రహము వచ్చినదా?

కృ—సరేకాని, అగణితశాఖాలంకృతంబై యింతమహాభారంబుగానున్న యీవృక్షమును నేనొక్కఁడఁ బెకిగింపగలనా?

సత్య—అయ్యో! ప్రాణేశ్వరా! మరల నొకక్రొత్తయాటంకమును దెచ్చిపెట్టితిరా? పరిహాసముమాని కార్యసాఫల్యముఁ జేయుడు.

కృ—కార్యసాఫల్యసాధనము మదీయ సామర్థ్యమున నుండినచో నట్లే చేయుదును. అట్లే యధికాయాస మొందుదుననియున వగవక యిట్టి నిర్భరకార్యమునాపైఁ బెట్టుట భావ్యమా? నాజనకసహోదరులైనచో నన్నిట్టిపనికి నియోగింతురా?

సత్య—నిష్ఠురభాషణంబులచే నాడెందమును గుందింపనేల? మీరీస్వల్పకార్యంబు చేయలేనన్నచో నెవ్వరు నమ్మగలరు. పూర్వకాలంబున గూర్మావతారధారివై మందరోర్వీధరంబెత్తలేదే? మెండియు శ్వేతవరాహమూర్తివై సముద్రమగ్నవసుంధరోద్ధరణ ప్రిమోదివి కాలేదా?

కృ—తత్తత్కార్యనిర్వహణార్థమై యవతారంబులనెత్తితిని.ఇప్పుడు కేవల మనుష్యమాత్రుఁడనుగదా? మనుష్యునకట్టిసామర్థ్యంబుగలుగునా?

సత్య— భక్తజనాధారంబగు నీయవతారంబున మాత్రమట్టి కార్యములఁ జేయలేదా? నాఁడు నాకలోకాధీశ్వరుండగు సంక్రందనుఁడు రాళ్ళవాన గురియింప సకల గోపగోపజన సంరక్షణార్థమై గోవర్ధన ధరాధరేంద్రంబు కందుకంబు చందంబున నీ కరారవిందమున గోప బృందంబులు డెందమున నానందింప నెత్తలేదా?

కృ—ప్రాణేశ్వరీ? చక్రనివాసాజ్ఞప్తికిఁ దెచ్చితివి; నాటి మహాసామర్థ్యంబు నేఁడు తెచ్చుకొని యీపారిజాతంబు పెల్లగించెద.

సత్య—ఇంక మనము నిరభ్యంతరముగ దీనిని దీసికొనిపోవచ్చును.

(తెరలో)

ఓహో యెవ డాపారిజాతవృక్ష సమీపమునకు? మా మహేంద్రునాజ్ఞ గొనక యెవ్వరును దానిం జేరఁగూడదు.

కృ—ఇంక నీవృక్షమునదరిఁ జేరఁగూడదు. దేవీ! యేమయినను గానిమ్ము. ద్వారకానగరమున కరిగెదము. సంక్రందను సేవకుఁడగు గంధర్వుఁ డఱచుచున్నాఁడు.

సత్య—మందభాగ్యురాల నగు నాకన్నియు విఘ్నములే కలుగుచున్నవి. దేవా! యెట్లయినను సాహసముచేసి నాముచ్చట చెల్లింపుడు.

(అని బతిమాలుచున్నది.)

కృ—సరే. ఓయి గంధర్వా! నేను ద్వారకానగర వాస్తవ్యుఁడనగు శ్రీకృష్ణుండను. మీసంక్రందనుని యానఁ గైకొని యిందు విహారింపుచున్నాము.

సత్య—(కొంచె మాఁగి) మీపలుకుల నాలకించి యాగంధర్వుఁ డిటువచ్చుటలేదు.

కృ—వచ్చిన నేమి? పారిజాతమహీరుహమును భవదీయమందిరోద్యానమధ్యంబున నాఁటెదను. గంధర్వసార్వభౌమసమన్వితుండై సర్వపర్వతారాధియగు సుపర్వసార్వభౌముఁడు వచ్చినను వానిని నిగ్రహించెద. నీవెందమున నాందోళము దక్కి యానందము నొందుచుండుము. ఇదిగో సమూలంబుగా దానిని బెల్లగించెద.

(అని దగ్గఱకుఁ బోవుచున్నాఁడు.)

సత్య—ప్రాణేశ్వరా! జయమగుఁగాక! జయమగుఁగాక!

కృ—దేవీ! నీపలుకులవలననే నాకు జయమగును.

సత్య—దేవా! ఈవృక్షమూలమున బండిగురివెందతీఁగె లెంత దట్టముగా నల్లుకొనియున్నవో చూడుఁడు.

కృ—దేవీ! ఇదిగో! చూచుచున్నాను.

తే. గీ. అన్యలీదేవభూరుహం బపహరింతు
రనుభయమ్మున నమరనాయకుఁడు దీని
బండిగురివెందతీఁగెలఁ బదిలముగను
సంకెలలు వైచి బంధించు సరణిఁ దోఁచు.

మఱియు నోదేవీ!

చ. తడవుగఁ బారిజాతవసుధారుహమీలతికాళిఁగూడి యి
క్కడ నొకకాన్పునం బెరిగెఁ గావునఁ దమ్మునిబాయుమిత్రముం
గడపటిసారి గాటముగఁ గౌఁగిటఁ జేర్చెడునాఁగ జూడు మీ
యెడఁ బెనవేసికొన్న యని యీలత లాతరుమూలమున్ సఖీ.

సత్య—ఆ చిరకాల మిత్రములను వేరుఁజేయుటకుఁ గారణము నేనయితిని గదా యని నామనసు జాలినొందుచున్నది.

కృ—ఓదయామయీ! అయినను మీ పాపముఁ జేయవలదు.

కృ—దేవీ! నీ వీమహీరుహంబును బడయఁగోరుటచే నిది సర్వవిధముల నిన్ను బోలియున్నయది. ఎట్లనిన

తే. గీ. వెడఁదకొమ్మలు బాహులు బెడఁగుఁజూపుఁ
జిగురుటాకులు కెమ్మోవి చివురుదాల్పుఁ
బూవుఁగుత్తులు పాలిండ్ల పోలుపు దెలుపు
కొత్తమొగ్గల చాలు పల్కువరుసపోలు.

(అని తీఁగెలో త్రిగించుచున్నాఁడు.)

(తెరలో)

మాధవా! ఆవృక్షముమూలమున నున్న తీఁగెల నిర్మూలింపకుము. అవి దేవేంద్రుని పత్నికి ప్రియతమములు.

సత్య—ఈమూర్ఖుఁడు తానే యీపూఁదోఁట కధికారివలెఁ బ్రేలుచున్నాఁడు.

కృ—దేవీ! సేవకాధీనమయిన పదార్థము పోయినచో యజమానుఁడా సేవకుని దండించును. ఈగంధర్వుఁడు సేవకుఁడు గావున నిట్లను

చున్నాడు. సేవకులు యజమాను నాజ్ఞానుసారవర్తనులు గదా! కానీ భయములేదు. (అని వృక్షమును బెల్లగించును.)

(అప్పుడు చిత్రగ్రీవుఁ డనుగంధర్వుడు ప్రవేశించును.)

చిత్ర—ఓజగన్నాథా! సుపర్వసార్వభౌమసేవకుడను. ఈనందనవనపాలకుఁడను. చిత్రగ్రీవుఁ డనువాఁడను. మహేంద్రునియాజ్ఞలేకయు మదీయాభిప్రాయంబులేకయు నీపారిజాతవృక్షమును నిర్మూలింపనేల?

కృ—మూఢుఁడా! ఈపారిజాతమును ద్వారకానగరస్థిత మదీయోద్యాన వనంబునకుం గొనిపోయెద! జీవనాపేక్ష గలిగియున్న-చో నడ్డము రాకుము.

చిత్ర—(కోపముతో) ఏమేమి? ఈప్రపంచసృష్టి మొదలింత వఱకు నిట్టి విచిత్రంబుగనలేను. సకలలోకాధీశ్వరుండై యష్టదిక్పాలకసేవ్యుండై యపారధైర్య పారావారుండైన మహేంద్రునైన జూచి వెరువక నీయిచ్ఛానుసారముగాఁ బారిజాతమును దీసికొనిపోయెదవా? దాని నక్కడఁబెట్టి మరికదలుము.

కృ—దాని నక్కడఁబెట్టను. నిన్నిక్కడ బలిపెట్టెదను. నీచగుణసమన్వితుఁడ వగుసేవకుఁడవని కరుణాతరంగితహృదయుండనై యుపేక్షించినకొలఁది బ్రేలఁజొచ్చితివేమి? దిక్పాలకసమేతుండైన మీయింద్రుడొక్కఁడేగాఁడు. త్రిదశకోటి నిర్జరగణంబులును దాడిపెట్టినను యీహావదోహాలంబున వారినందఱ నిర్జించెద. పో! యీవార్త మీసార్వభౌముఁ డైనమహేంద్రునితోఁ జెప్పుకొనుము.

సత్య—మూఢుఁడా? నీవంటియధముఁ డొక్కఁ డాటంకము చేసిన నాఁగునని వచ్చితివా యేమి!

చిత్ర ఓకృష్ణా! మాధవీలతాసమేతం బగునీపారిజాతము మాశచీదేవి కత్యంత ప్రియము. నీవు దీనిని గొంపోయిన నామె తెప్పించుకొనక మానదు.

సత్య—(కోపముతో) నీనిరర్థక ప్రలాపంబులతోఁ బనియేమి? హృదయమేశ్వరుండునాహృదయరంజకస్వభావుండగుటచేనేను సామంతం

గలిగి దీనిం దెప్పించుకొనుచుంటిని. మీశచీదేవి త్రిలోకాధీశ్వరుం డగు మహేంద్రుని పట్టమహిషి గాదు. అందుచే సామంతం బుండినచో దన భర్త పరాక్రమముచే నీవృక్షమును దిరిగి తెప్పించుకొను మని చెప్పుము. తనపంతంబును నాపంతంబును నీసారి చూడుమనుము.

చిత్రి—ఏమీ! విష్టపత్రయ పూజ్యురాలగు మాశచీదేవినే నిందింపుచుంటివిగా! యీ వాక్యంబు లామె విన్నచో మీప్రాణంబులు మీకు దక్కెడునేమో చూచెదను.

కృ—(కోపముతో) ఓధూర్తవర్తనా! నీశిరఃకర్తనం బిప్పుడే యాచరించెదను. నీప్రాణసంరక్షణార్థమై దిక్కున్నచో రమ్మనుము.

(అని కత్తిదూసి వేయఁబోవుచున్నాఁడు.)

చిత్ర—మహేంద్రా! శరణుశరణు (అని పారిపోవుచున్నాఁడు.)

సత్య—(నవ్వుచు) ఆర్యపుత్రా! కట్ట తెగిపోయిన మహాప్రవాహంబుచందంబున నొక్కపరుగుననే వెన్నిచ్చి పారుచున్నాఁడు. ఈతం డిప్పు డెచ్చటి కరుగును?

కృ— ఈనందనవనాధికారి యగు సంక్రందనుని సమక్షంబున కరిగి తనపరాభవంబు నాయదితి తనూభవున కెరిగించును.

సత్య—సరే! వాఁ డెట్లయిన నేమి? మన మీపారిజాతమహీరుహంబునుచేకొని ద్వారకానగరంబున కరుగుదము రండు.

కృ—ఓసత్రాజిన్నందనా! నాకస్వామి నెరుఁగకుండ నీవ్రమాకుం గొనిపోవుట యనుచితము.

మ. అమరేంద్రుం డిది యాలకించి యనిసేయ న్వచ్చువాఁడంచుఁ దోఁ
చు మదిం బోరు దొరంగినం బిరికికృష్ణుండొక్క ప్రముచ్చట్లు వృ
క్షము నీ దొంగిలిపోయినాఁడనుచు లోకం బెల్ల నిందించు ని
త్యమునుం గావున నిపుడు వీరపురుషవ్యాపారము న్సల్పెదన్.

సత్య—ఒకవేళ సునాశీరుఁడు సేనలం గూర్చుకొని కయ్యమునకు సిద్ధమైనచో?

కృ—కదనక్షోణికి వచ్చినచో మదీయతీక్ష్ణ సందక కౌక్షేయక

ధారలచే నీయక్షయలోక వాసుల క్షతవిక్రములఁ గావించి యొక్క క్షణమునవచ్చి నీకటాక్షవీక్షణంబులకుఁ బాత్రుఁడ నయ్యెద.

సత్య—ప్రాణేశ్వరా! ఈత్రివిష్టపవాసులెల్ల మహాక్రుద్ధులై శ్రద్ధతో యుద్ధసన్నద్ధు లగుదురు గాఁబోలును. మిక్కిలి జాగరూకతతో నుండవలయును.

కృ—ప్రాణేశ్వర బలపరాక్రమపరిజ్ఞానములేని యోబేలా! బాలా! యింత భయాక్రాంతవు గానేల? గంధసింధురసదృశ బంధురగర్వాంధు జరాసంధుని, దత్సహాయాగత శిశుపాలాది నరపాలవర్గంబును, నాఁడు రుక్మిణీకల్యాణ సమయమున జగత్ప్రసిద్ధముగ జయించుట నీవు వినలేదా? మరియుఁ జక్రశార్ఙ్గనందకకౌమోదకీపాంచజన్య శోభితుం డగు నీ మగని కెవ్వ రీడు?

సత్య—అవును. ఆమాట నిశ్చయమే. గంగగోవున కాగ్రహము వచ్చినచందమున మీకు రాకరాక కోపము వచ్చినచో మీ యెదుర నెవరు నిలువఁగలరు?

కృ—అల్లరిగియు నిట్లు బేలతనంబున జాలిపడనేల? అయినను సన్నగాలికి సయితము లతలు చలించును గదా! ఆయింద్ర యమాదుల వలన మనకు భయములేదు. అదిగో యెవ్వరో వచ్చుచున్నారు. (అని పరికించి చూచి) అదిగో గంధర్వనాయకుఁ డగు చిత్రరథుండు వచ్చుచున్నాఁడు. ప్రాయశః మహేంద్రుఁడు వీనిని నాయొద్దకు దూతఁగా బంపి యుండును.

సత్య— ఆర్యపుత్రా! మహేంద్రుఁడు మనలను జాలకనఁగా బోవనీయఁడు. కావునఁ గడుమెలఁకువతో మెలఁగవలయునని మరల విజ్ఞాపనం బొనర్చుచుంటిని.

కృ— దేవీ! రణమునకుఁ బోచున్నప్పుడు జయాపజయములు ముందు నిశ్చయింప నలవిగాదు.

మ. అనిలో గెల్చితి నేని నీవొసగు గాఢాలింగనం బంది మ
 న్ననమై నీకలికించితమ్ములకు నానందించెదన్ దివ్యశ

త్రుటికాయంబుల నాజిలోఁ దెగిన వీరస్వర్గము న్జూరకొం
దును రంభాపరిజృంభణము గాంతు న్నీకు గన్నెరగ్రిగాన్.

సత్యా—అమంగళము ప్రతిహత మగుఁగాక! కులదేవతలు మిమ్ము రక్షింతురు గాక!

కృ—(నవ్వుచు) దేవీ! మరచితివా! యేవేల్పులవలన నీవు రక్షణముఁ గోరుచున్నావో యావేల్పులతోడనే మన కిప్పుడు కలహముగదా!

సత్యా—అట్లయిన వేల్పులవేల్పు మిముఁ బ్రోచుఁగాక!

కృ—నేనే దేల్పులవేల్పనని దివిజులందరు న న్నెన్నుచున్నారు.

సత్యా—అట్లయిన మిమ్మును మీరే రక్షించుకొందురు గాక!

[అప్పుడు చిత్రరథుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిత్ర—(తనలో) రాయబారము నడపుటయే కష్టము. అందు మురశాసన బలశాసనులకు దౌత్యము నడుపుట కష్టతరము.

చ. విడువఁడు వేల్పుమ్రాఁకు నరవిందదళాక్షుఁడు సత్యభామకు
న్గడుఁ బ్రియమైనకారణమున న్మచి విన్నఁదనంబు దాల్చుటన్
విడువఁడు పంతము న్నముచిభేదియు సంధి పొసంగె నేని మే
ల్కడునగుఁ బ్రాతజుట్టములు గానఁ బురందర నందనందనుల్.

చిత్ర—అట్టిసంధి నాసందేశమువలననే గావలయును. న న్నిచ్చోటికిఁ బనుచునపుడు మహేంద్రునిసమక్షమున దేవగురుఁడగు బృహస్పతి నాతో నిట్లని యానతిచ్చెను.

ఆ. వె. యాదవేంద్రుఁ గాంచి యాదరంబున మ్రొక్కి
కార్యగతుల నెల్లఁ గలయఁ దెల్పి
మనసు నొవ్వకుండ మనపని చెడకుండ
రాయబార మీవు సేయవలయు.

కావున బృహస్పతివచనప్రకారము సందేశము నిర్వర్తింపఁ బ్రయత్నించెదను. అదిగో వాసుదేవుఁడు దేవీసమేతుఁడై యున్నవాఁడు.
(ప్రకాశముగా) యదుకుంజరున కభివాదము సేయుచున్నాఁడను.

కృ—గంధర్వనాయకునకు స్వాగతము.

సత్యా—(తనలో) మన్ననలకు లోపమెన్నఁడు లేదు.

చిత్ర—మహాత్మా! నారదాదులగు సురమునులవల్లమీమహిమ వినుటయేగాని యిదివరకుఁ గన్నులార మిమ్ము్మను దర్శింపలేదు. ఇప్పుడు ధన్యుఁడ నయితిని.

కృ—నీపరిచయము నాకును నానందమై యున్నయది. కాని మనము కలసిన సమయ మంతప్రశస్తమయినది గాదు.

చిత్రి—దేవా! మీకుం జెప్పదగినవారు విష్టపత్రయమున లేరు. కాని, నావిన్నపమొకటి మన్నింతురుగాక!

ఉ. వేలుపురాచవారలకు వెన్నునకు న్బగ చెల్లునయ్య యే
కాలమునందును న్వినము, కానము చిత్రిము లింతలేసి యా
నీలగళుండు విన్ననిది నీరజగర్భుఁడు విన్న నవ్వారే
పోలదు పోలదో యనఘ పోరిఁక పొందుపొసంగ నుండరే.

కృ—నీతిగర్భితమగు నీయుపదేశము నీప్రభువగు మహేంద్రునకుఁ జేయఁదగినది యేమనగా?

తే. గీ. పారిజాతపుష్పంబుల పాన్పుమీద
మేనుఁ జేర్ప నాపూఁదండ మెడనుదాల్ప
తురుమునందును జాలఁ గ్రొవ్విరులు దురుమ
మనసుపడియున్న దెంతో యీమందయాన.

అందుచేత నీముద్దియ ముద్దుచెల్లింపఁ గొండొక కాలంబు పారిజాతము ద్వారకానగరంబునకుం గొంపోయి యీాలతాంగి యుద్యానవనంబున నాటఁదలంచి మాకు మహేంద్రునికడ నున్న చనువుపెంపునఁ దెపోనరించి దీని బెకలించితి నంతియకాని పాకశాసనునితో మాకు వైర కారణము లేదు.

సత్య—(కృష్ణునిచెవిలో) ఆర్యపుత్రా! వృక్షమును మాత్రము విడువకుము.

చిత్ర—దేవా! యిందు నేరము పాకశాసనుని దనిగాని నీయది యనిగాని నిర్ణయించుటకు నే నెంతవాఁడను? అయిన నాకద్రుమముల పై దివిజులకుఁగల యనురాగ మించుకం జెప్పెద వినుము.

సీ. పవ్వళింపదుసుమీ పాకశాసనురాణి
పారిజాతపుఁ బాన్పు పైనెగాని
యరుతేఁదాల్పఁడుసుమీ యమరేంద్ర తనయుండు
మందారకుసుమదామంబె గాని
తిరుగనొల్లరుసుమీ తెఱగంటి విరిబోండ్లు
హరిచందనచ్ఛాయలందె గాని
చేయనొల్లరుసుమీ శివపూజ వజ్రి సం
తాన భూరుహాలతాంతములఁగాని
అన్నిటికి నేమిగాని యయ్యమరదూత
చెవి నిడదు సుమీ కల్పపల్లవమెగాని
యొకటి బలశాసనునకు వేఱొకటి శచికి
కడమవారికి గడమవి కామితములు.

కృ—సరే. నీమాటలవలన పారిజాత మింద్రాణికిఁ గరము ప్రియ మని తెలిసినది. అయినను క్షీరసాగరమునం దీతరువులు ప్రభవించినది మొదలు నేఁటివఱ కా శచీదేవియే దీని పుష్పంబుల నుపయోగించుటం జేసి కొండొక కాలంబు సత్రాజిన్నందన కామహీరుహం బెరవుగా నిచ్చి యామె ముచ్చట తీఱినవెనుక నామె మరల గ్రహింపవచ్చును.

చిత్ర—వాసుదేవా! ఈవృక్షాపహరణవార్త వినినంతన యా శచీదేవి మొగము విన్నఁబోయె. ఇల్లాలి మొగముఁ జూచి పాకశాసనుఁడు విన్నఁబోయె. అతని దైన్యంబుఁ గని జేజేలమొగములు చిన్నబోయె. వేయేల? త్రివిష్టపమంతయు వెలవెలఁ బోవుచున్నయది. ఇప్పుడుపౌలోమి ముద్దుచెల్లింపక యాఖండలు డేపనికిం జొరఁడు గావున దివిజుల నను గ్రహింపుము.

సత్య—వగచువారున్నప్పు డెన్నిమారులైన విన్నఁబోవచ్చును.

కృష్ణు— (చిరునగవుతో) ఇందు సత్యభామకో శచీదేవికో విన్నఁదనము రాకమానదు. అది యట్లుండగా,

తే. గీ. పాకవైరికిఁ గల దొక్కపద్మగంధి
యామెయలుకకె తానింత యడలెనేని

వెలఁదు లున్నారు పదియాఱువేలు నాకు
వారికిన్కకు నే నెంత వడఁక వలయు.

చిత్ర—మహారసికుఁడవు, దక్షిణనాయకుడవు నగునీకు విలాస వతుల ప్రణయ కలహముఁ దీర్చుటలోఁగల నేఱజాణతనము మహేం ద్రునకు లేకపోవచ్చు దానికేమి; అయ్యాఖండలుఁడు త్రిలోకాధీశ్వరుం డగుట నయ్యింద్రమహిషి యుపేంద్రుడవగు నీకును సత్రాజిన్నందనకును మాననీయయగుఁ గావున నామెమాట చెల్లుట పాడి.

కృ—అది పాడిగాదు.

ఆ. వె. ఎల్లయపుడు పెద్దలుల్లసిల్లుచు నున్న
చిన్నవారిముద్దు చెల్లు టెపుడు
రాకరాకవచ్చు రాచబందుగుల మ
న్నించి పనుచు టెల్ల మంచిపాడి.

చిత్ర—త్రివిక్రమా! అదితిగర్భజనితులలో నీవు కనిష్ఠుఁడవు. ఆ సహస్రాక్షుఁడు జ్యేష్ఠుఁడు. అన్న యనుభవించుదానిని తమ్ముఁ డాస చేయుట ధర్మశాస్త్ర విరుద్ధము.

కృ—ఏమి! అన్న యనుభవించుదానిఁ దమ్ముఁ డాసింపఁ గూడ దా? అట్లయిన,

ఆ. వె. నీవుపలికినట్ల నిర్జరేంద్రున కేను
తమ్ముఁగుఱ్ఱనాట తథ్యమగును
నాకరాజ్యమందు నావంతుభాగంబు
పంచి కుడుచు టెపుడు పాడిగాదె?

సత్య—(తనలో) ప్రాణేశ్వరునిపలుకు మిక్కిలి ప్రౌఢముగా నున్నయది.

చిత్ర—(రోషముతో) వాసుదేవా! ఈజంభాసురపరిపంథి సకల కళ్యాణగుణ పరిపూర్ణుం డనియు తేజశ్శాలియనియు నాది విష్ణుండవైన నీవును శంకరపంకజాసనులును త్రివిష్టపసామ్రాజ్యమున నతని నభిషిక్తుఁ జేసియు మహాపదవియందు నతని సుప్రతిష్ఠునిఁ గావించి యనంతరము దేవతలు పూర్వదేవగణ దుగ్ధపారావారంబుఁ నాఁడు మథియింప నందుఁ

బ్రిభవించిన కల్పవృక్షము మొదలగు ననేక పదార్థంబులను భూమ్యా కాశంబులు సూర్యచంద్రులు సకలనిర్జరగణంబులు సాక్షులుగ నయ్యా ఖండలునకిచ్చి నేఁ డేటికో నెపంబున వచ్చి దానిమరలఁ గైకొను టిది యేటి ధర్మము? నీవు సిరియుఁ గౌస్తుభంబును గైకొని తక్కుఁగలవానిని స్వీయముగా విడుచుకొంటివి.

కృ—అవును, గంధర్వా! అవును. ఇది స్వీయంకృతాపరాధమే! చూడుము.

సీ. పవమానజవమైనఁ బరిహాసింపఁగజాలు
హయము నుచ్చైశ్శ్రవం బతనికిచ్చి
ప్రణుతకళ్యాణ లక్షణసులక్షితమైన
యైరావతగజేంద్ర మతని కిచ్చి
జిలిబిలిపాటల శిలలయినఁ గరగించు
నచ్చరలేమల నతని కిచ్చి
అడిగినకోర్కుల నప్పుడ సమకూర్చు
పారిజాతచందనాదుల నతని కిచ్చి
గడుపుకొనుటలే దెకాలమెట్టులో నేను
కంటినిండ న్నిదుర గానకుండ
పాముపాన్పుఁ జేసి పక్షిగుర్రముఁ జేసి
నీరరాసి నాకు నెలవుఁ జేసి.

మరియు క్షీరసాగరవృత్తాంతము నీవు జ్ఞప్తికిఁ దెచ్చితివి. కనుక నీమాట నిజము.

ఆ. వె. పాలసంద్రమందుఁ బ్రభవించె నీ్రమాకు
కడలిఁ బుట్టుసిరియుఁ గౌస్తుభంబు
నెవఁడు దాల్చె నతఁడె యీ్రమూఁకుఁ గ్రహియింప
దగునుగాక యొరుఁడు తగునె చెప్పుమ.

చిత్ర—అట్లయిన క్షీరాబ్ధిలోఁ బొడమి యింద్రుని యధీనములో నున్న సమస్తవస్తువుల నీవ గ్రహింపవచ్చును.

కృ—మాకు కావలయునేని అట్లేచేయుదుము.

చిత్ర—మాధవా! నే నింక నీ పలుకులకుఁ బ్రత్యుత్తరము జెప్ప నక్కరలేదు. అయిన నీపలుకులు రాజనీతికి నయితేఁము విరుద్ధముగా నున్నయవి.

కృ—అయ్యా! రాజనీతినిగురించి యించుక చెప్పెద వినుము.

తే. గీ. తమ్ముఁడన్న యనక తండ్రి సుతుఁడనక
మేటిపగతుఁడనక చిరమిత్రుఁడనక
చేవఁగలవాఁడు బలహీనుఁ జెరుపఁ జూచుఁ
దలఁప రాజనీతికి నొక్కదారిగలదె.

మరియు నోదేవదూత!

క. తప మొనరించెడు మునివరుఁ
గపటోపాయమునఁ గూల్పఁగా నింద్రునకే
నృపనీతి దొరకె మును పా
నృపనీతియె నేను నిపుడు నేర్చికొంటిన్.

చిత్ర—ఈమాటలు నిశ్చయముగా మామహేంద్రునకలుక పుట్టించును. అందుచే నీకించుక చెప్పవలసి చెప్పుచున్నాను.

తే. గీ. అతనిబుతుమార్గ వర్తనం బతనిశక్తి
యతనివజ్రాయుధ మహత్త్వమతనిచండ
పుష్కలావర్త నీరదంబుల తెఱంగు
నీ వెఱుంగుదో యెఱుఁగవో నీరజాక్ష.

కృ—(చిరునవ్వుతో) అయ్యా! తత్ప్రభావము నే నేమెఱుంగుదును? ఎఱిగినవారు కొంద రన్నారు చెప్పెద వినుము.

సీ. అలపుష్కలావర్త జలధరంబులశక్తి
గోవర్ధనం బనుకొండ యెఱుఁగు
శత్రుదుస్సహమైన జంభారిమగఁటిమి
పలుమారు పోరిన బలియెఱుంగు
కొండరెక్కలఁనెల్ల జెండిన కులిశంబు
మహిమమించుక గరుత్మంతుఁ డెఱుఁగు

నీవు గొండాడిన ఋజుమార్గవర్తన
వేగన్ను లిచ్చినయోగి యెరుఁగు
నే నెరుగకున్న ముజ్జగం బెరుఁగదా? కో
పాకశాసను గడితంబు బంటుఁదనము
జంభుఁ గడతేర్చినట్లు వృత్రుని జంపినట్లు
గెలువవచ్చు నాలమునందుఁ గృష్ణ నిపుడు.

చిత్ర—మృదువచన గర్భితములైన యీయుల్లసపు నుడువులు మర్మభేదములుగా నున్నయవి. ఈపలుకులు విన్నచో మహేంద్రుఁడు ని న్నిట్లనకపోఁడు.

ఆ. వె. పాలుగుడుపవచ్చు పడఁతిఁ జంపుటగాదు
గోగణంబుఁ గాచుకొనుట కాదు
వ్రేతలిండ్ల వెన్న జుర్రుటగాదు
అమరవిభునితోడి సమర మరయ.

కృష్ణు—గంధర్వనాయకా! పలుమాట లేటికి? దేవసభలో నా మాటలుగా నిట్లు పలుకుము!

చ. అమరులరక్షణంబునకు పై దనుజేంద్రులసేన నైన బ్రయు
క్తములగు చక్రశాస్త్రములు కాలవంశంబున నమ్మహేంద్రు పై
నమరులమూఁకపై నతిభయంకర సంగరమందు సంప్రయు
క్తములగు నేఁడటంచు మది గాఢవిషాదము నాకుఁ గల్గెడిన్.

చిత్ర—అట్లయిన నీవు యుద్ధసన్నద్ధుఁడ వగుటకే నిశ్చయించు కొంటివా?

కృ—అమరేంద్రుఁడు సంధికిఁ జొరనిపక్షమున నట్లే.

చిత్ర—సంధి యెట్లు?

కృ—ఈపారిజాతవృక్షము నాకిచ్చుటయే సంధికి వచ్చుట.

చిత్ర—అట్లయిన నీవృక్షమును విడువవని మహేంద్రునితో జెప్పవలసినదేనా?

కృ—నిశ్చయముగా విడువనని చెప్పుము.

చిత్ర—అట్లయిన నేనిఁక బోయి మహేంద్రునితో నాసందేశార్థము విన్నవించెదను. (తనలో) వాసుదేవుఁడూ మహేంద్రునిమాట మన్నింపఁడుగనుక నీయాదవచంద్రునకు పారిజాతము నిచ్చి సంధి చేసికొనుటయే మహేంద్రునకు దేవకోటికిని హితమని తోఁచెడును. అందుచే సంధి గావింపుమని నే నింద్రుని త్వరపెట్టి యిచ్చటికిఁ బంపెదను.

(అని చిత్రరథుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సత్యా—అమ్మయ్యా! ఇప్పటికి పారిజాత భూరుహము నాకుఁ దక్కినదని ధైర్యముగ లిగినది.

కృ—ఎందుచేత గలిగినది?

సత్యా—చిత్రరథుని పలుకులకు మీ రిచ్చిన యుత్తరంబులను మహేంద్రునకు మీ రంపించిన సందేశంబును నావీనులకు విందొనరించి నాకిట్టి ధైర్యమును గొల్పినయవి.

కృ—ఇంతమాత్రముచేతనే మనోరథసిద్ధి యయ్యోనని సంతసింపకుము. బిడౌజుఁ డసాధారణతేజస్సంపన్నుఁడు.

సత్యా—(చిరునవ్వుతో) అతని తేజస్సంతయు నొక్కనిమిషము క్రిందట మీరు చిత్రరథునియెదుట నుగ్గడించినపుఁడే నే నెఱింగితి. ఇప్పుడు వేర మీరు కొనియాడ నక్కఱలేదు.

కృ—మన మనుకొన్నయట్లు మహేంద్రుఁ డల్ప తేజస్కుఁడైనను నాతోఁ గలహంబునకు వచ్చువాఁ డతఁ డొక్కఁడేగాదు. సప్తజిహ్వ, సమవర్తి, సలిలేశ, పలలాశ, సమీర, కుబేర, ప్రముఖులగు దిక్పాలకులు వేల్పుదొరకు బాసటలై వత్తురు. అప్పుడు విజయము మనకే యగునని యెట్లు నిర్ణయింపఁ గలము?

సత్యా—అట్లయిన యుద్ధముతప్పదా?

కృ—అదిమాత్ర మెట్లు చెప్పగలను?

సత్యా—మీపలుకులు చిత్రరథముఖంబున విని మహేంద్రుడు సంధిచేయునని తలంచెదను.

కృ—నే నట్లు తలంపను. ఏలయన, నీమ్రాఁకుఁ దెమ్మని నీవు నన్ను నెంత పురికొల్పుచున్నదానవో శచీదేవియు తనభర్తనంత పురికొల్పు

చుండును. భార్యచెవి నిల్లు గట్టుకొని పోరు సేయుమని పోరుచున్నపుడు సంధి పొసంగు టెట్లు? అదియునుఁ గాక!

ఆ. వె. మానవంతులైన మగవారి జగడంబు
లంత మొందవచ్చు నింతనంత
నుపశమిల్లు టరిది యుద్ధంబుగాకుండ
నాఁడుదానికతన నైనపోరు.

సత్యా—హృదయేశ్వరా! మీపలుకులు నాచెవులకుఁ గఠినములుగా నుండినను సత్యమునకు దూరములు గావు.

కృ—(నవ్వుచు) కళ్యాణీ! సత్యభామతో సత్యదూరములైన పలుకులు పలుకరాదుగదా!

సత్యా—అదిగో! యెవరో వచ్చుచున్నారు.

కృ—(పరికించి చూచి) దేవగురుసమేతుఁడై మహేంద్రుడే వచ్చుచున్నాఁడు. ఇతఁడుస్వయముగావచ్చుటచేత సంధియగుననితోచెడి.

సత్యా— ఆర్యపుత్రా! నాపిరికితనముచేత నే నిట్లనుచుందును. మీరు మరియొకలాగునఁ జేయరుగాని యీవ్రమాఁకు మన యధీనమున నుండునట్లే సంధిచేయుదురుగాక!

(అప్పుడు బృహస్పతియు నింద్రుఁడును ప్రవేశించుచున్నారు.)

బృహ—(తనలో) ఎంతెంతవారైన నొకప్పుడు భ్రమపడుదురు.

శా. సత్రాజిత్తనయా విధేయుఁడయి కంసద్వేషి కాంక్షించె నీ
ధాత్రీజంబు శచీవిధేయుఁడయి సుత్రాముండు దైత్యారితో
శత్రుత్వంబును బూనె నిర్వురును తేజశ్శాలు లేమంటకుఁ
పాత్రాపాత్రము లెన్న నేరరుగదా భార్యానుకూలాత్మకుల్.

ఇంద్రు— ఆచార్యా! చిత్రరథుని సందేశవిశేషములను వినియున్నారుగదా? ఇపుడు గర్తవ్యమేమి?

ఉ. పోరుదునా హరిం గదిసి పోరితినేని గృతఘ్నుఁ డీసునా
సీరుఁడు రక్షకుండయిన శ్రీహరి దాఁకె నటంద్రు భూజనుల్
పోరక యుంటినా యమరభూరుహ మొక్కఁడు గొంచుఁబోవఁ దాఁ
బౌరుషహీనుఁడై కులిశపాణిరణంబుఁ దొలగె నంద్రయో!

బృహ—మహేంద్రా! నీతిశాస్త్రవిశారదుఁడ వగునీవు కర్తవ్యము నన్నడుగవలయునా? పగవారు రాష్ట్రము నాక్రమించునపుడు రాచవారు నడుచుకొనవలసిన పద్ధతి నెరింగించెద. దానిఁబట్టి కర్తవ్యము నీవే యూహించుకొనుము.

ఆ. వె. పగతులావు నెంచి స్వబలంబు గణియించి
తనకు విజయ మగుట తథ్యమేని
చెరుపవలయు శత్రు శీఘ్రంబ కాకున్న
సంధిచేసుకొనుట చాలలగ్గు.

ఇంద్రు—ఇప్పుడు మనము వాసుదేవుని గెలువఁ గలమా?

బృహ—అది కలలోనివార్త.

ఇంద్రు—అట్లయిన సంధిచేసుకొనుట యుక్తమా?

బృహ—కాక మరేమున్నది?

ఇంద్రు—అట్లయిన వాసుదేవునిసమీపమునకుఁ బోదము రండు.

(అని దగ్గఱకుఁ బోవుచున్నారు.)

కృ—దేవీ! ప్రస్తుతము పగతురైనను మహేంద్ర బృహస్పతులు మనకు మాననీయులు సుమా!

సత్య—ఉత్తములు పరస్పరవైరమునందును గౌరవమువిడువరు.

మహే—(సమీపించి) యాదవచంద్ర! విజయతాంవిజయతాం.

బృహ—దానవారాతి ర్జయతు! జయతు!

కృ—నిర్జరేంద్రనిర్జరాచార్యయోః స్వాగతము.

మహే—దేవా!

సీ. జయదేవకీగర్భ జలధికైరవమిత్ర
జయదళత్కంజ విశాలనేత్ర
జయమహాపాతక జంబాలమార్తాండ
జయశైలజాధావ చాపఖండ
జయనీలనీరద శ్యామలాంగవిలాస
జయమానిహృత్కుశేశయనివాస

జయరమామానస జలజాతమదభృంగ
జయమదాసుర చమూచయవిభంగ
చరణనిర్గతస్వర్గంగ సాధుసంగ
కరధృతరథాంగ భవతమోభరపతంగ
జయజయాండప్రజేడ్ప్రతురంగ జయమురంగ
వేల్పుగొంకల గొంకయో వెన్నదొంగ!

తే. గీ. పిన్న వయ్యును మాకంటెఁ బెద్దవగుచు
గుణవిహీనుఁడ వయ్యును గుణుఁడ వగుచు
బంధుశూన్యుఁడ వయ్యు సబంధువగుచు
వెలయు చిత్రస్వభావుని వినుతిఁ జేతు.

సత్య—(తనలో) దేవతలు బింకము వదలి నయమారంభించినారు.

కృ—
తే. గీ. నుతికిఁ దగనట్టిమనుజుని నుతి యొనర్ప
జెల్లునట వయ్య నీకు శచీవిధేయ
ఇంద్ర- యవని నవతార మొందిన హరివిగాక
మనుజుఁడవ నీవు సత్యభామావిధేయ.

కృ—అయ్యా! నేనిప్పుడు స్వర్గమునకొంగనైతిని గనుక నుతి కనర్హుండని చెప్పుచున్నాను.

బృహ—యాదవేంద్రా! నీవు క్రొత్తగా నీనాఁడు దొంగవు కాలేదు-చూడు.

తే. గీ. ప్రాఁమనుకు లెల్ల హరియించి వార్ధిఁబడిన
దొంగదైత్యుఁ జంపిన ప్రాఁతదొంగ వీవు
ఇంద్ర- పాలకడలికన్నియ మనఃపంకజంబు
దోఁచుకున్నట్టి యాగజదొంగ వీవు.

సత్య—(చిఱునవ్వుతో రహస్యముగా) ప్రాణేశ్వరా! వీరు మిమ్ములను మిక్కిలి చక్కఁగా వర్ణించినారు.

కృ—అయ్యా! మహేంద్రా! ఓయాచార్యా! మీరు నామాటనే

టనే స్థిరపఱుచుచున్నారు. అందుచేతఁ ద్రిలోకాధీశ్వరునకు నే నిప్పుడు దండ్యుఁడను.

ఇంద్రు—యాదవేంద్రా! ఇవి యేటిమాటలు.

తే. గీ. ఎవని దీనాక మెవని దీదివిజవృక్ష
మెవని దీనందనోద్యాన మెవఁడు గురుఁడు
ఎవని దీవేల్పు బలఁగ మీయింద్రుఁ డెవ్వఁ
డన్నియును నీవ నీవార లంద ఱనఘ.

బృహ—అచ్యుతా! నీ కన్న నన్యమెద్దియులేదు. చూడు.

శా. నీలోన న్బ్రభవించు నీభువనము ల్నీయందె వర్ధిల్లెడున్
నీలోన న్లయమొందు నుండఁ గలదే నీకన్న నన్యంబికన్
నీలోవారలుగారె యీదివిజులు న్నేను న్సునాసీరుఁడున్
మాలోవాఁడవు గావె నీవు మహితాత్మా దేవకీనందనా.

బృహ—నీకు దూషణభూషణతిరస్కారంబులు సమానంబులు. మహేంద్రునివలన నేరంబులు లేవు. ఉన్నను గావవలయు.

ఇంద్రు—పతితులనైనఁ బరమపావనులఁగా నొనర్చు నీవు నేరములులేని నన్ను గరుణింపఁదగు.

కృ—మహేంద్రా!

చ. సరిసరి యెంతమాట త్రిదశ ప్రభునంతటివాని నేనఁటే
కరుణ క్షమించువాఁడఁ గుతుకంబును జెందెను సత్యభామ నీ
మఱఁదలు పారిజాతకుసుమంబులఁ దాలుప నొక్కసారి యీ
తెఱవను గారవించుటకుఁ దెంపొనరించితి కూర్మిపెంపునన్.

ఇంద్రు—నీవలన నేరములేదు. పౌలోమియుఁ దన కత్యంత ప్రియమయిన యీమహీరుహ మన్యహస్తగత మయినదని విని, కడుం గడు ఖిన్నయయ్యె.

తే. గీ. విన్నఁదన మెన్నఁ డెఱుఁగని వెలఁదిమోము
విన్నవోవ నామన సెంతొ చిన్నవోయె
మీవదినెముద్దు సెల్లింప మీకకడకటు
చిత్రరథు నంపితిని కిన్కచేతఁ గాదు.

బృహ.—ఈమహేంద్రుని పలుకులు నిశ్చితములు.

కృ—త్రిలోకాధీశ్వరా! నీకిష్టమయ్యేనేని పారిజాతవృక్షమును ద్వారకానగరమునకుం గొంపోయి సత్యభామా మందిరోద్యానమున నాటి యొక్క సంవత్సరమైనవెనుక మరల మీవృక్షము మీకనిపెదను.

సత్య—(తనలో) అయ్యో! దీనినొక సంవత్సరముమాత్రమే నాకేళివనంబున నిలుపుమని ప్రాణేశ్వరుఁడు గోరుచున్నాఁడు. శాశ్వతముగా నుండునట్లు కోరిన బాగుండును.

బృహ.—యదుకుంజరా! ఇది మాకు ప్రసాదముకదా.

ఇంద్ర—వాసుదేవా? ఒక్క సంవత్సరమే గాదు.

చ. సురహితముం బొనర్చుటకు క్షుద్రనిశాచరుల వ్వధింపఁగా
ధరణీతలంబునందు నవతారము దాలిచి యెన్ని నాళ్ళు మీ
రురుతరలీల నుండెదరొ యుంచుకొనందగు నన్ని నాళ్ళు నీ
తరువును ద్వారకాపురిని దానవమృగజేంద్ర సింహమా!

సత్య—(సంతోషముతో) ధన్యురాలను! ధన్యురాలను! ఇది మాకు మహాప్రసాదము.

కృ—ప్రాణేశ్వరీ! దేవతలు యదుకులము ననుగ్రహించినారు. నీ మనోరథసిద్ధికిఁ గారకులగు నీమహేంద్ర బృహస్పతులకు జోహారు సేయుము.

సత్య—ఇదిగో నమస్కరించుచున్నాను. (అని నమస్కారము చేయుచున్నది.)

ఇంద్ర—బృహ.—కళ్యాణమస్తు.

కృ—బృందారకేంద్రా! మీరొనర్చిన యుపకారమునకు నేను కృతజ్ఞుఁడ నయితిని. ఇంకమాకు సెలవొసంగితిరేని ద్వారకానగరంబునకు బోదుము.

బృహ.—ఇందుఁ గృతజ్ఞత కేమున్నది? మేమేమీకు కృతజ్ఞులమై యుండవలయు. ద్వారకానగరముననుండిమీకు స్వర్గవాసులమగు మేము కడుదవ్వగుచున్నను జేరువ నున్నట్లెంచుకొనవలయును.

కృ—శరీరములు దూరమునను్నను, హృదయములు సమీపముననేయుండును.

ఇంద్రి—స్వపురమునకుంబోవఁ గుతూహల మొందుచున్న మిమ్ము మేమే నిలుపరాదు. మీకు సమస్తమంగళము లగుఁగాకఁ మఱియు.

ఉ. బాధ లెడంగునట్లు పలుబాసలకబ్బము లల్లియల్లి నీ
గాథలఁ బాడుచుండెదరు గాక మహీజను లెల్ల నెల్ల వి
ద్యాధరసుందరు ల్కరములందు విపంచులు దాల్చియు న్నభో
వీధుల మ్రోయ పాడుచును విందొనరింతురుగాక నీకథల్.

కృ—అట్లగుటకు మీప్రభావమే కారణము.

బృహ—మహానుభావులగు నిందోపేంద్రుల కలయికచేత జగముల కనంత కళ్యాణము లిట్లగుగాత!

తే॥ గీ. కుంభవృష్టిగ వానలు కురియుఁగాత!
ప్రజలకు సమృద్ధిగా నేల పండుగాత!
నీతిమంతులై చరియింత్రుగాత! జనులు!
న్యాయముగ నేలుదురుగాత నవనినృపులు!

(అందరు నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము.



బాకస్సముద్రాక్షరశాల, రాజమండ్రి.—1938.

# జ్యోతిష గ్రంథములు.

| | రు | అ |
|---|---|---|
| జ్యోతిషప్రథమబోధిని | 0 | 8 |
| జాతకమార్తాండము 1 వ భా | 1 | 8 |
| డిటో 2 వ భా | 1 | 8 |
| డిటో 3 వ భా | 2 | 0 |
| జ్యోతిషరహస్యము 1 వ భా | 1 | 8 |
| డిటో 2 వ భా | 1 | 8 |
| జ్యోతిషవిద్యాప్రకాశిక సంజ్ఞాధ్యాయ 1 వ భా | 1 | 0 |
| గణితాధ్యాయము 2 భా | 1 | 0 |
| భావఫలాధ్యాయం 3 భా | 3 | 0 |
| ద్వాదశభావఫలము 4 భా | 2 | 0 |
| అదృష్టదీపిక | 0 | 10 |
| హస్తసాముద్రికము | 0 | 8 |
| జ్యోతిషఫలప్రదర్శిని | 0 | 10 |
| దశాభుక్తిఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1 | 0 |
| పుట్టుమచ్చలశాస్త్రము | 0 | 8 |
| జాతకచంద్రిక గోపాలరత్నాకరము | 0 | 8 |
| మయవాస్తు, వాస్తుశిరోమణి, సనత్కుమారవాస్తు } ఈ 3 చేర్చి ఒకే పుస్తకం | 0 | 12 |
| వాస్తుసంగ్రహము | 0 | 12 |
| నవగ్రహచింతామణి | 0 | 2 |
| శిల్పవాస్తు | 0 | 12 |
| జాతకఫల మణిమంజరి | 1 | 8 |
| గర్గసంహిత | 0 | 4 |
| జయమినీసూత్రములు | 1 | 0 |

| | రు | అ |
|---|---|---|
| అనుభవజాతకతరంగిణి | 0 | 8 |
| పూర్వపారాశరి | 0 | 8 |
| గృహవాస్తుదర్పణము (నూతనపద్ధతులతో వ్రాయబడినది) | 0 | 12 |
| మూలస్తంభము (శైవగ్రంథము) | 0 | 8 |
| బృహత్పరాశరసంహిత | 0 | 4 |
| ఆంధ్రజాతకతత్వము సూత్రములు 1 వ భా | 1 | 8 |
| ,, 2 వ భా | 1 | 8 |
| గోచారసంహిత | 0 | 12 |
| కాలామృతము | 0 | 12 |
| శిల్పసంగ్రహము | 0 | 8 |
| ఆయుర్దాయయోగం | 1 | 0 |
| ముహూర్తదర్పణం | 0 | 8 |
| రెట్టమతశాస్త్రము 60 సం॥ పంచాంగము | 0 | 12 |
| జాతకనారాయణీయం | 1 | 8 |
| స్వప్నఫలదీపిక | 0 | 8 |
| సకలసర్వగుణ అదృష్టదీపిక | 0 | 10 |
| గౌతమసంహిత | 0 | 8 |
| పాంచానాడీయం | 0 | 8 |
| జాతకరాజీయం | 1 | 0 |
| జ్యోతిషఫలగ్రంథము | 0 | 2 |
| శకునశాస్త్రం | 0 | 8 |
| స్త్రీజాతకం | 0 | 8 |
| యవనజాతకం | 0 | 8 |
| జ్యోతిషార్ణవనవనీతం | 1 | 0 |

